# చైతన్య కవిత

**17**

భావ నామ సంవత్సరం

వసంత ఋతువు

**1994**
**SPRING**

సంపాదకులు
తంగిరాల సుబ్బారావు
ఆర్వీయస్. సుందరం

చైతన్య కవితా వేదిక
ఆర్-2, జ్ఞాన భారతి
బెంగుళూరు - **560 056**

CHAITANYA KAVITA; a journal devoted to Telugu poetry. Published by Chaitanya Kavita Vedika, R-2, Jnana Bharathi, Bangalore University Campus, Bangalore-560 056. April 1994.
PP. XII+72

| | | | | |
|---|---|---|---|---|
| ముఖ చిత్రం | : | ప్రముఖ కవి డా. ఎన్. గోపి (తెలుగు ప్రొఫెసర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు) | | |
| అట్ట వెనుక | : | ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు (1894 - 1972) (ఫొటో : శ్రీ బసిరెడ్డి శ్రీనివాసులు రెడ్డి - నెల్లూరు, 1964) | | |
| అక్షరాలంకరణ | : | ఆచార్య పి. సి. నరసింహారెడ్డి (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) | | |
| వెల | : | విడి ప్రతి | : రూ. | 20-00 |
| | | ప్రత్యేక సభ్యత్వం | : రూ. | 200-00 |
| | | జీవిత సభ్యత్వం | : రూ. | 500-00 |
| | | పోషక సభ్యత్వం | : రూ. | 1000-00 |
| ప్రకటనలు | : | రెండవ కవరు | : రూ. | 3000-00 |
| | | మూడవ కవరు | : రూ. | 2000-00 |
| | | పూర్తి పుట | : రూ. | 1000-00 |

For copies:

**Prof. T.V. SUBBA RAO**
Department of Studies in Telugu
Bangalore University
Jnana Bharathi
**Bangalore 560 056**

**Dr. R.V.S. SUNDARM**
Department of Telugu
I.K.S. University of Mysore
Manasa Gangotri
**Mysore 570 006**

DTP :
ముద్రణ : Sree Laxmi Laser Graphics, Vijayanagar, Bangalore-560 040. Phone: 3300093

# మనవి

'చైతన్య కవిత' అనే ఈ కవిత్వ పత్రిక 1986 లో మైసూరులోని 'ధ్వన్యాలోకం' లో విశ్వవిఖ్యాత ఆంగ్లాచార్యులు ప్రొఫెసర్ సి. డి. నరసింహయ్యగారి ఆశీస్సులతో, ఆచార్య యస్వీ. జోగారావు గారి అమృత హస్తాలతో ఆవిష్కరింపబడింది. 1990 వరకూ ఆరు మాసాల కొకసారి, వసంత ఋతువు (ఏప్రిల్ నెల) లోనూ, శరదృతువు (అక్టోబరు నెల) లోనూ వెలువడుతూవచ్చింది. ఐదేండ్లలలో పది సంచికలు ముద్రించాం. కాని 1991 నుండి 1993 వరకూ అనివార్య కారణాలవల్ల సంవత్సరానికి ఒక్క సంచిక మాత్రమే వెలువరించగలిగాం. అంటే 1986 నుండి 1993 వరకూ మొత్తం 13 సంచికలు వెలుగు చూశాయి. ఒక్కొక్క సంచికకు సుమారు ఐదు వేల రూపాయలు ఖర్చు చేస్తున్నాం. (ఇంతవరకూ 65 వేల రూపాయలు ఖర్చు చేశాం). జీవిత సభ్యులూ పోషకులూ తప్ప ఈ పత్రికకు వేరే సహాయం ఏమీ లేదు. కవులూ, కవితాప్రియులూ అందరూ జీవిత సభ్యులుగా చేరి ఈ పత్రికకు ఆర్థికంగా చేయూత నివ్వవలసిందిగా ప్రార్థిస్తున్నాం. ఒక్కొక్కరు రెండువందల రూపాయల చొప్పున చెల్లించి వేయిమంది సభ్యులు చేరితే ఈ పత్రికను నడపడం కష్టమేమీ కాదు.

కేవలం కవిత్వం కోసమే ఉద్దేశించిన పత్రిక తెలుగులో లేదు. పైగా ఈ మా పత్రిక కర్ణాటక రాష్ట్రం నుండి వెలువడే తెలుగు కవిత్వ పత్రిక. ఇతర రాష్ట్రాల లోనూ, విదేశాలలోనూ తెలుగు భాషా సాహిత్యాలను, తెలుగు సంస్కృతిని ప్రోత్సహించడమే ధ్యేయంగా పెట్టుకున్నవారు తెలుగు విశ్వవిద్యాలయాధికారులు. అందువల్ల చైతన్య కవితకు కొంత గ్రాంటు నిచ్చి ప్రోత్సహించవలసిందిగా వారికి ప్రత్యేకంగా మనవి చేసుకుంటున్నాం. ఆంధ్రదేశంలో లేని ఒక విశిష్ట పత్రికను మేం ప్రచురిస్తున్నాం కాబట్టి, మాకు సహకరించవలసిన బాధ్యత తెలుగు విశ్వవిద్యాలయానికి ఉన్నదని నమ్ముతున్నాం.

చైతన్య కవితలో ప్రకటనలు ముద్రించడానికి కూడా సిద్ధపడుతున్నాం. వివిధ సంస్థలవారు, పారిశ్రామిక వేత్తలు విరివిగా ప్రకటనలిచ్చి మాకు తోడ్పడతారని ఆశిస్తున్నాం. ఈ సంచికకు ప్రకటనలిచ్చి ప్రోత్సహించిన వారందరికీ మా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

ఈ కవిత్వ పత్రిక ముద్రణ అసాధ్యమైనప్పుడు, మా యందలి వాత్సల్యంతో ముందుకు వచ్చి చేయూతనిచ్చే ఆపద్బాంధవులు ఇద్దరున్నారు. ఒకరు మా చైతన్య కవితా వేదిక అధ్యక్షులైన శ్రీ డి. కె. ఆదికేశవులుగారు, మరొకరు ఉపాధ్యక్షులైన శ్రీ బుల్లా సుబ్బారావుగారు. వీరిద్దరికీ మేము ఆజన్మాంతం ఋణపడి ఉన్నాం.

కాలహరణాన్ని తగ్గించడానికీ, ముద్రారాక్షసాలను దగ్గరుండి పరిహరించడానికీ వీలుగా 'చైతన్య కవిత'ను ఇప్పుడు బెంగుళూరులోనే డి.టి.పి. ఆఫ్‌సెట్‌లో ముద్రిస్తున్నాం. అయినా శ్రీ ముఖ సంయుక్త సంచిక ముద్రణకు ఆరు మాసాలు పట్టింది. ఇక మీదట ఈ కాల దోషాన్ని తప్పించుకుందుకు ప్రయత్నిస్తున్నాం. దీనిలో భాగంగానే, భావ వసంత శరత్సంచికల ముద్రణ ఒకేసారి చేపట్టాం.

ముద్రణ వ్యయం ప్రతి సంవత్సరం పెరిగిపోతూ ఉండడంతో ప్రత్యేక సభ్యత్వం 100 రూపాయలనుండి 200 రూపాయలకు పెంచడం జరిగింది. కాబట్టి ఇది వరలో 100 రూపాయలు కట్టినవారంత మరో 100 రూపాయలు పంపవలసిందిగా ప్రార్థిస్తున్నాం.

బెంగుళూరు -- సంపాదకులు

భావ - ఉగాది **11-4-1994**

ఈ సంచిక ముద్రణ వ్యయాన్నంతటినీ గొప్ప ఔదార్యంతో భరించిన ప్రియ మిత్రులు, నిగర్వి , స్నేహశీలి, మహాభక్తుడు, దానకర్ణుడు, దళవాయి కృష్ణస్వామినాయుడు గారి జ్యేష్ఠ కుమారుడు అయిన శ్రీ డి. కె. ఆదికేశవులు (మేనేజింగ్ ట్రస్టీ, శ్రీనివాసా ట్రస్టు, బెంగుళూరు - చిత్తూరు) గారికి మా నమశ్శతములు...

''నమో నమస్తేఽస్తు సహస్ర కృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే!''

-సంపాదకులు

# అంకితం

75 వసంతాలు నిండిన

ప్రముఖ నవ్యాంధ్ర కవి

ప్రయోగ వాది

ప్రగతి వాది

వాస్తవికతా శిల్పి

శ్రేష్ఠ చలన చిత్ర దర్శక నిర్మాత

డా. రాంమనోహర్ లోహియా ప్రియమిత్రుడు

త్రికరణ శుద్ధిగా సోషలిజాన్ని ఆచరించిన పవిత్రుడు

ఉత్తమ సాహిత్య పోషకులైన తిక్కవరపు రామిరెడ్డిగారి పుత్రుడు

కవిలోకంలో **'పఠాభి'** గా ప్రసిద్ధి కెక్కిన

శ్రీ తిక్కవరపు పట్టాభి రామ రెడ్డి గారికి

ఆయురారోగ్య సంపత్పరంపరాభివృద్ధిని కాంక్షిస్తూ...

భక్తితో....

– తంగిరాల సుబ్బారావు

– ఆర్వీయస్. సుందరం

చైతన్య కవిత - 17

భావ వసంతం, Spring 1994

# 75 వసంతాల ఫిడేలు రాగం*

–తంగిరాల సుబ్బారావు

విశ్వకవి రవీంద్రుని ప్రియ శిష్యుడి వైయుండి కూడా-
కవిత్వం వైయక్తికమై
ఆకాశ వీథుల్లో విహరిస్తున్నప్పుడు
అయోమయంగా ఊహిస్తున్నప్పుడు
జపం విడిచి లొట్టలు వేస్తున్నప్పుడు
నేలమీద కఠోర వాస్తవికతను
'ఫిడేలు రాగాల డజను' గా పలికించిన
'పఠాభి' వి నీవు!
భావకవిత్వ శిథిలాలలోంచి పుట్టిన
అహంభావ కవివి నీవు!
వచన పద్యాల దుడ్డుకట్టలతో
పద్యాల నడుములు విరగ్గొట్టిన
ధైర్య శాలివి నీవు!
శబ్దార్థాల్ని చిత్ర విచిత్ర టెలిస్కోపుల్లోంచీ
మైక్రోస్కోపుల్లోంచీ చూచి
ఆధునికతను ప్రదర్శించిన
ప్రయోగశీలివి నీవు!
అభ్యుదయ కవితోద్యమ భవనాని కున్న
నాలుగు మూలస్తంభాలలో నీవొకడివి-
శిష్ట్లా, నారాయణబాబు, శ్రీశ్రీల ప్రియమిత్రుడివి!
అకవిత్వం కవిత్వ వేషం వేసుకున్నప్పుడు
అసలు కవిత్వాన్ని అకవిత్వంగా చూపి
అవ హేళన ఖడ్గాన్ని ఝళిపించిన రసపుత్రుడివి!!
అంతేకాదు-

---

* ఇటీవలనే 75 సంవత్సరాలు నిండిన ప్రముఖ కవి 'పఠాభి' అనబడే శ్రీ తిక్కవరపు పట్టాభి రామిరెడ్డి గారి కోసం ఈ కవిత.

గణితశాస్త్ర పరిశోధనలో తలమున్కలై
అగణిత రహస్య రత్నాలను వెలికి తీస్తున్న సాహసివి!
నంబర్ థియరీలో ఫెర్మాట్ ప్రోబ్లం సాల్వ్‌చేసిన మేధావివి!

సంపన్న కుటుంబంలో పుట్టి
సంఘ సంస్కరణ పథాన్ని మెట్టి
దేశ విదేశాలలో విద్యా వీర గంధాన్ని ముట్టి
సోషలిజంకోసం సంసారమంతా పణంపెట్టి
రామ మనోహర లోహియా వంటి నిస్వార్థ ప్రజాసేవకునికి అప్తుడవై
జీవితాన్ని సార్థకం చేసుకున్న నిండు మనిషివి, నిజమైన మనీషివి!!

తిక్కవరపు వంశం సిరిసంపదల వశం
సాహిత్య పోషణకు త్రివేణీ సంగమం
మీ 'సుదర్శన మహల్' గృహాంగణం
కృష్ణరాయల ప్రాంగణం
జాషువావంటి మహాకవులకు కల్పవృక్షం మీ నాన్నగారు
నాటి నుండి నేటివరకూ కొనసాగుతున్న 'తిక్కన జయంతి' సభలే
రామిరెడ్డిగారి కవిత్వ రాసిక్యానికి రమణీయోదాహరణాలు!
'తల్లిపుట్టిల్లు మేనమామకు తెలియదా?' అన్నట్టు
'జనహిత కమలోల్లాస భానుడు' బెజవాడ గోపాల రెడ్డిగారు
మీ మేనమామ-కం-బావగారు!
వారి మేన మామలు 'రేబాల వారు' అపర దానకర్ణులు!
'వర్ధమాన సమాజం' తో విరాజిల్లే నెల్లూరు టౌను హాలు
మీ రెడ్ల కీర్తి పతాకా లెగుర వేస్తున్న సారస్వత విక్రమ సింహం జూలు!!

75 వసంతాలు నిండిన ఓ ఫిడేలు రాగమా!
నీవు
తెలుగు వాళ్ళకు చిత్ర విచిత్ర ప్రయోగాల కవివి
కన్నడిగులకు ఉత్తమ కళా'సంస్కార' చిత్రాల అపూర్వ దర్శకుడివి
దేశ విదేశాల మేధావులకు ప్రముఖ గణిత శాస్త్ర వేత్తవు!
మీ శ్రీమతి 'స్నేహలతారెడ్డి' గారు సంఘ సేవకురాలు

మానవ హక్కుల పరిరక్షకురాలు
నిరంకుశ ప్రభుత్వాన్ని నిరోధించడంలో
ప్రాణాలను బలిపెట్టిన ధీరురాలు!
ఆవు వెనకాల లేగ దూడలా అదే పథంలో కూతురు 'నందన'
దిక్కూ మొక్కూ లేని వీధిపిల్లలకు ఆశాస్పందన!
కొడుకు 'కోణార్క్' గిటార్ రాగాల ఉలితో చెక్కాడు
శిల్పసమన్వితమైన సంగీత సూర్యదేవాలయ శిలాచక్రం!
ఇలా మీ సంసారమే ఒక కళాఖండం!
కవిత్వం-శాస్త్రం-చలనచిత్రం-సంఘసేవ-సంగీతం
అన్నీ రంగరించిన అపురూప అమృత భాండం!!

75 వసంతాలు తిలకించిన ఓ ప్రముఖ కవీంద్రా!
శ్రీశ్రీగారు తన విశాఖ మాండలికంలో
'ఎవడు బ్రతికాడు మూడు యాభైలు?' అని అన్నా,
మరో 75 వసంతాలు నీవు చూడాలని
మనసారా కోరుకుంటున్నా!!

చైతన్యకవిత-17

14-4-1994

''మన జాతి లోని సవర్ణ వివాహాలు
సువర్ణ వివాహాలు పోవాలి''

❃ ❃ ❃ ❃ ❃

''రెక్కాడితే కాని
డొక్కాడని వాడు
రైల్వే సిగ్నలర్''

❃ ❃ ❃ ❃ ❃

''ట్యూబు బేబీలు వచ్చాక
మాతృత్వం లోని మహనీయత
గాజువారింది''

(- 'పఠాభి పన్‌చాంగం' నుండి)

# వసంత కోకిలలు

# ఒక వివరణ - ఒక సవరణ

## కవితారస కూలంకష - అనుబంధం

శ్రీముఖ (1993) వసంత శరత్తుల సంయుక్త సంచికలో నేను మల్లంపల్లి శరభయ్యగారి వ్యక్తిత్వాన్ని గురించి 'కవితారస కూలంకష' అనే వ్యాసం వ్రాశాను. దాంట్లో ఒక ముఖ్యవిషయం వ్రాయడం మరచిపోయాను. దానిని ఇక్కడ అనుబంధంగా ఇస్తున్నాను:-

## మల్లంపల్లివారి కాశీఖండ వ్యాఖ్య

తెలుగు విశ్వవిద్యాలయానికి ఆచార్య సి.నారాయణ రెడ్డి గారు ఉపాధ్యక్షులుగా ఉన్నప్పుడు, రాజమండ్రీ ప్రాంగణంలోని సాహిత్యపీఠం వారు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారి ఆధ్వర్యంలో శ్రీనాథుని రచనలన్నింటికీ సమగ్రమైన వాఖ్యవ్రాయించి ప్రకటించాలని నిశ్చయించారు. అప్పుడు కాశీఖండాన్ని మల్లంపల్లి శరభయ్యగారికి అప్పగించారు. శరభయ్యగారు మిక్కిలి శ్రమించి 'మణికర్ణికావ్యాఖ్యాన' మనే పేరుతో కాశీఖండానికి 1600 పుటల వ్యాఖ్య రచించి ఇచ్చారు. దీని మొదటి సంపుటం 1992 లో వెలువడింది. దీనికి శరభయ్యగారు 'దర్శనము' అనే పేరుతో వ్రాసిన పీఠిక అమూల్యమైనది. శరభయ్యగారి కాశీఖండ వ్యాఖ్య, వేదం వేంకటరాయశాస్త్రిగారు 'శృంగార సర్వంకష' అనే పేరుతో శ్రీనాథుని శృంగారనైషధానికి వ్రాసిన వ్యాఖ్యకన్న చాలా పెద్దది. ఈ వ్యాఖ్య మల్లంపల్లివారి పాండిత్యప్రకర్షకు నికషోపలం!

-తంగిరాల సుబ్బారావు.

## సవరణ

శ్రీముఖ (1993)సంయుక్త సంచికలో శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు రచించిన 'సరస్వతీ అవతారుని హృదయగ్రాహి పద్యాలు' అనే వ్యాసంలో 18 వ పుటలో 6 వ పంక్తిలో "Beaudelaire derived this from Poem" అని తప్పుగా ముద్రింపబడిన దానిని "Beaudelaire derived this from Poe" అని చదువుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాం.

మా అన్నయ్య లక్ష్మీకాంతం - విశ్వనాథ సత్యనారాయణ xi

-సంపాదకులు

పింగళివారి శతజయంతి (1894-1994) సందర్భంగా-

# మా అన్నయ్య లక్ష్మీకాంతం

-కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

అయిన వాడికి కావలసినది వేరు. లోకానికి కావలసి నది వేరు. ఆయన పోతే విశ్వనాథ సత్యనారాయణ ఏమంటాడు? అన్నది యీ లోకంలో కొందరికి కావాలి. అందుకోసం పత్రికలవాళ్లు వచ్చి అడగడం, యీ దేశంలో ఇది ఒక చమత్కారం.

ఒక గొప్పవాడు పోతే కొందరి అభిప్రాయాలు సేకరించి అవి పత్రికలలో ప్రకటించడం, దీని ప్రయోజనం ఏమిటో నాకు తెలియదు. ఆ పోయినవాళ్ళ బిడ్డలు ఇంటిదగ్గర కర్మలు చేస్తారు, కర్మలు వైదికం. బ్రతికి ఉన్నవాళ్ళు చచ్చినవాళ్ళని గురించి దుఃఖపడతారు. ఆ దుఃఖం అనేక రకాలు. ఆ చనిపోవడం న్యాయంగా చనిపోతే సహజమైన దుఃఖం. అతని కుటుంబం యొక్క దుఃఖం వేరు. అతను గొప్ప వాడనుకున్న వాళ్ళ దుఃఖం వేరు. అతని స్నేహితుల దుఃఖం వేరు. దేశం యొక్క దుఃఖం వేరు. స్నేహితులలో అనేక రకాలుంటారు. అతను గొప్పవాడునుకునే వాళ్ళలో కూడా చాలా రకాలు ఉంటారు. ఒక్కొక్కప్పుడు స్నేహం విలక్షణంగా ఉంటుంది. వాళ్లు డెబ్భై ఏళ్లు బ్రతుకుతారు. చివర20 ఏళ్లు విరోధులు. ఆ విరోధం కూడా ఒక విలక్షణంగా ఉంటుంది.

మొదటి 20 ఏళ్లు అన్నాదమ్ముల కంటే దగ్గరవాళ్లు. చచ్చిపోయినవాడు అన్న, బ్రతికి ఉన్నవాడు తమ్ముడు. ఒట్టి అన్న కాదు. వాడే గురువు, నడిస్తే వాడికి మల్లే నడవాలి. వాడికి మల్లేనే కవిత్వం వ్రాయాలి. వాడాజ్ఞాపించేవాడు. వీడు సేవకుడిలాంటివాడు. ఇద్దరూ ఒక కంచంలో తిన్నారు. ఒక మంచంలో పడుకున్నారు. ఒక పెద్ద పట్టణంలో వీళ్ళిద్దరికీ నలభైఏళ్లు సంబంధం లేకపోయినా ఆ పట్టణంలో అందరూ వీళ్ళిద్దరూ నిత్యమూ కలిసి ఉంటారని తెలిసినవాళ్ళే, వీడు కనబడితే వాణ్ణి అడుగుతారు, వాడు కనబడితే వీణ్ణి అడుగుతారు. ఈ నలభై ఏళ్లు - అట్టే మాట్లాడితే యాభై ఏళ్లు - ఈ తమ్ముడు, ఆ అన్నను తిడుతూనే ఉన్నాడు. ఆ అన్న ఈ తమ్ముణ్ణి ఎన్నడూ ఏమీ అనలేదు. తన చేతనైన ఉపకారం మాత్రం చేయలేదు. 'వీడికి చెయ్యకూడదు' - అని నిర్ణయించుకున్నాడు. కానీ, వాళ్ళిద్దరూ కలిస్తే ఒకళ్ళతో ఒకళ్లు మాట్లాడకుండా ఎప్పుడూ ఉండలేదు. ఆ అన్న ఉన్నతి చెందితే ఎప్పుడూ సంతోషించేవాడు తమ్ముడు. ముందర యీ తమ్ముడు చస్తే ఆ అన్న ఏడ్చేవాడే అనుకుంటాను. ముందర అన్నే చావడం జరిగింది. తమ్ముడు ఏడుస్తాడు.

'రావణాసురుడు చచ్చేందుకు విభీషణుడు సహాయపడ్డాడు, వాలి చచ్చేందుకు సుగ్రీవుడు కారణం. ఆ విభీషణుడు, ఆ సుగ్రీవుడు ఆ అన్నలు చస్తే ఏడ్చారు!' అని రామాయణ కల్పవృక్షంలో వ్రాశాడు ఈ తమ్ముడు.

ఆ అన్న చచ్చినందుకు యి తమ్ముడు ఏమీ కారణం కాదు. మరెందుకు ఏడవడు? ఈ పత్రికల వాళ్లు అడిగారు గనుక, వాడు అనగా ఆ తమ్ముడు వాడి ఏడుపు యొక్క స్వరూపమేమిటో చెప్పక తప్పదు. ఆ అన్న కొడుకులు కూడా యీ తమ్ముడు పడ్డంత దుఃఖం పడతారో లేదో (వణుకుతున్న కంఠంతో- గాద్గదికంగా) వీరికి తెలీదు. కొన్ని కొన్ని లౌకికములైన వ్యర్థాభిమానాలతో అతనిని గొప్ప వాడనే వాళ్లున్నారని, ఈ తమ్ముడికి తెలుసు. ఈ తమ్ముడి దుఃఖం లోకమూ ఆయన గొప్పదనమూ, ఆయన చేసిన ఉద్యోగాలకు సంబంధించింది కానేకాదు- (ఏడుస్తూ).

ఈ తమ్ముడు తన తల్లి కడుపున పుట్టిన వాళ్ళలో పెద్దవాడు. వాడికి అన్నల్లేరు. ఒకడు వాడికి అన్న అనడం సహించడు. ఒకాయన అన్న కావడానికి యత్నిస్తే-''నీ అన్నతనమూ నీవూ''-అని మొగాన కొట్టేడు. వాడంత అహంకారి, అట్టి ఆ అహంకారి ఇద్దరినే అన్నలుగా స్వీకరించాడు. ఒక అన్న కొన్నాళ్లక్రింద పోయినాడు. ఆయన పేరు-ఒంగోలులో పెద్ద ప్లీడరు - శ్రీనాయని నరసింహారావు నాయుడు; రెండవ అన్న పింగళి లక్ష్మీకాంతం. బ్రతికి ఉన్నప్పుడు వాళ్ళిద్దర్ని అన్నలుగా చూచాడా? చూడ్లా. వాడి ప్రకృతిలో లేదది. వాడి మనస్సులో పాతుకుపోయిన భావం అది. ఆ ఇద్దరన్నలు పోయినారు గదా?- ఇప్పుడు నిజంగా వాడు ఎవడికీ భయపడనక్కరలేదు. వాడే పెద్దవాడు, ఇవ్వాళ వాడు స్వతంత్రుడు. పూర్వం మాత్రం కాదా? పూర్వమూ స్వతంత్రుడే! కానీ అన్నలున్నారుగా! ఇప్పుడు వాళ్లు లేరు.

ఇంతే! ఓహో (:.......) స్వాతంత్ర్యమంటే దుఃఖంతో కూడా కలిసి ఉంటుంది కాబోలు! (ఏడ్చారు).

(ఆంధ్రప్రభ, 11-1-72)

( ఈ వ్యాసాన్ని సేకరించి ఇచ్చిన ప్రియమిత్రులు ఆచార్య లింగమనేని బసవశంకరరావు గారికి కృతజ్ఞులం- సంపాదకులు)

---

**1994 లో చేరిన పోషకులు :**

శ్రీమతి పి. ఎస్. లక్ష్మి, శ్రీ పి. వేణుగోపాలరావు దంపతులు,
భౌతిక శాస్త్ర శాఖ, ఎమోరి విశ్వవిద్యాలయం, అట్లాంటా, అమెరికా.

**జీవిత సభ్యులు :** శ్రీమతి ఎన్. సురేఖ, హోసూరు, ధర్మపురి జిల్లా, తమిళనాడు.

---

పింగళి వారి శతజయంతి (1894 - 1994) సందర్భంగా

# ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు
# (1894 - 1972)

- నాగళ్ళ గురుప్రసాదరావు

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు ఆధునిక యుగపు ప్రసిద్ధ పండిత కవి, విమర్శకుడు. ఈయన కృష్ణా జిల్లాలోని 'చిట్టూరు' గ్రామంలో క్రీ. శ 1894 జనవరి 10 వ తేదీని జన్మించారు. వీరి తండ్రి వేంకటరత్నంగారు; తల్లి కుటుంబమ్మగారు. లక్ష్మీకాంతంగారు రేపల్లె లోని ప్రాథమిక పాఠశాలలోను, తరువాత మచిలీపట్టణంలోని హిందూ ఉన్నత పాఠశాలలోను, నోబుల్ కళాశాలలోను, విద్యనభ్యసించి, చివరికి మద్రాసు విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పట్టాన్ని సంపాదించారు. మచిలీపట్టణంలో చదివేటప్పుడే చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికి శుశ్రూష చేసి, సంస్కృతాంధ్రాలను లెస్సగా పఠించి, శాస్త్రిగారి శిష్యులలో లక్ష్మీకాంతంగారు అగ్రగణ్యుడయ్యారు.

మొదట నోబుల్ కళాశాలకు చెందిన పాఠశాలలో ఆంధ్ర పండితుడుగా పనిచేసి, తరువాత మద్రాసు విశ్వవిద్యాలయంలో ప్రాచ్య పరిశోధన శాఖలో కొంతకాలం పరిశోధన చేసి, చివరికి ఆంధ్రా విశ్వవిద్యాలయంలో ఆంధ్రాచార్య పదవిలో లక్ష్మీకాంతంగారు రిటైరయ్యారు. ఆ తరువాత ఆకాశవాణి (విజయవాడ) కార్యక్రమ నిర్వాహకోపదేశకుడుగా కొంతకాలం పనిచేసి, కడకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖాధ్యక్షుడై అక్కడే ఉద్యోగ విరమణ చేశారు.

విద్యార్థిగా ఉన్నప్పుడే కాటూరి వేంకటేశ్వరరావుగారితో కలిసి లక్ష్మీకాంతంగారు ఆంజనేయస్వామిపై ఒక శతకం చెప్పారు. తిరుపతి వేంకటకవులకు కొప్పరపు కవులతో వివాదం ఏర్పడినప్పుడు గురువుల పక్షాన నిల్చి, వఝ్ఝమన్నాటి నరసింహంతో కూడి కొప్పరపు కవులను పద్యాలతో ఎదుర్కొన్నారు. కాటూరి వేంకటేశ్వరరావుగారితో కలిసి 'తొలకరి' అనే ఖండకావ్యాన్ని, 'సౌందరనందము' అనే మహాకావ్యాన్ని ఈయన రచించారు. ఈ జంట కవులు అనువదించిన నవల 'బగ్‌జార్గల్';

లక్ష్మీకాంతంగారు స్వతంత్రంగా అనువదించిన నవల 'మాబిడిక్'; 'ఆంగ్లదేశపు చరిత్ర' అనేది వీరు అనువదించిన ఒక చారిత్రక గ్రంథం. లక్ష్మీకాంతంగారు స్వతంత్రంగా 'మధురపండితరాజము', 'ఆత్మలహరి' అనే కావ్యాలను రచించారు. 'గౌతమ వ్యాసములు', 'నా రేడియో ప్రసంగాలు', 'సాహిత్య శిల్ప సమీక్ష', 'ఆంధ్ర సాహిత్య చరిత్ర' అనేవి లక్ష్మీకాంతంగారిని ఉత్తమ విమర్శకుడుగాను, ప్రశస్త సాహిత్య చరిత్ర కారుడుగాను నిలిపిన గ్రంథాలు. విద్యార్థులకు ఉపయోగించే రీతిలో వీరు 'కుమార వ్యాకరణము' ను రచించారు. (లక్ష్మీకాంతంగారి సతీమణి లక్ష్మీనరసమ్మగారు కూడా మంచి రచయిత్రి; సంఘసేవకురాలు. ఈమె 'చల్లని సంసారం' అనే నవలను రచించారు. ఈమె 1969లో స్వర్గస్థురాలైనప్పుడు లక్ష్మీకాంతంగారు 'లక్ష్మీ నిర్గమనము' అనే పేరుతో ఒక చక్కని స్మృతి కావ్యాన్ని రచించారు).

గాంధీమహాత్ముని రచనల నుండి కొన్ని ముఖ్యభాగాలను ఏర్చి కూర్చి కృష్ణ కృపలానీ ఆంగ్లంలో ఒక గ్రంథ రూపంలో ప్రచురింపగా, దానిని 'మానవులందరు సోదరులు' అనే పేరుతో లక్ష్మీకాంతంగారు తెనిగించారు. వీరు రచించిన 'వేంకటేశ్వర శతకము', 'దుక్కిపాటి వారి వంశ చరిత్ర' ఇప్పుడు లభించడంలేదు. కాటూరి వేంకటేశ్వరరావుగారి తో కలిసి ఈయన ముదునూరు, తోట్లవల్లూరు, నెల్లూరు మొదలైన చోట్ల శతావధానాలు చేశారు. ఆ అవధాన వాఙ్మయం కూడా కనబడలేదు.

ప్రాచీన గ్రంథ పరిష్కరణంలో కూడా మంచి దిట్టగా లక్ష్మీకాంతంగారు పేరు గడించారు. కోరాడ రామకృష్ణయ్యగారితో కలిసి విష్ణుపురాన్ని, అవసరాల సూర్యారావు సహాయకుడుగా పలనాటి వీర చరిత్రను, స్వతంత్రంగా ద్విపద భారత ప్రథమ, ద్వితీయ సంపుటాలను లక్ష్మీకాంతంగారు పరిష్కరించారు.

నటుడుగా కూడా లక్ష్మీకాంతంగారు రాణించగలిగారు. పాండవోద్యోగ విజయాలు, ముద్రారాక్షసం- నాటకాలలో క్రమంగా ధర్మరాజు, రాక్షసమంత్రి పాత్రలను చక్కగా నిర్వహించి పేరు పొందారు.

ఇరవైయ్యవ శతాబ్దిలో ఆంధ్రసాహిత్య ప్రపంచంలో విమర్శను ఉత్తమ మార్గాలలో నడిపించిన ప్రముఖులలో లక్ష్మీకాంతంగారు ఒకరు. ప్రాచ్య, పాశ్చాత్య విమర్శ పద్ధతులను సమన్వయించడంలో ఈ పండితుడు ఎంతో కౌశల్యాన్ని చూపారు. నవీనాంధ్ర సాహిత్యవిమర్శకోసం నూతన పారిభాషికపదాలను సృష్టించడంలో ఈయన

కృతకృత్యుడయ్యారు. ఉత్తమ బోధకుడుగా వాసికెక్కి శిష్యులను పెక్కు మందిని సృష్టించినవాడగుట వలన ఈ ప్రజ్ఞాయుతుని విమర్శ పద్ధతి అచిరకాలంలోనే అన్యవ్యాప్తి పొందింది.

లక్ష్మీకాంతంగారు పరిపక్వత గాంచిన వచన రచయిత. ధారాళమైన గమనం, సమత, స్పష్టత, ఔచిత్యమెరిగిన పదప్రయోగం మొదలైన గుణాలతో వీరి గ్రాంథిక వ్యావహారిక వచనరచనలు సుందరంగా ఉంటాయి.

కేంద్ర సాహిత్య అకాడమీ కార్యవర్గసభ్యుడుగా లక్ష్మీకాంతంగారు కొంతకాలం వ్యవహరించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వీరికి విశిష్టసభ్యత్వాన్ని ఇచ్చి సత్కరించింది.

పింగళి లక్ష్మీకాంతంగారు 1972 జనవరి 10వ తేదీని దివంగతులయ్యారు.

(విజ్ఞాన సర్వస్వము, రెండవ సంపుటము,
తెలుగు సంస్కృతి-2, పుటలు 558,559)



గంగా యమునా స్రోత
స్సంగమ సుందరము సరస సౌందరనందం
బంగీకృత హృన్మేళన
పింగళి కాటూరి కవన విద్యాఫలమున్.

ప్రీణిత సద్రసజ్ఞుఁడగు పింగళి కాంతుని కావ్యశిల్ప ని
ర్మాణ ధురీణ బుద్ధిగరిమంబున కిర్వురె సాక్షు లిమ్మహిన్
వాణికి వాణియైన గురువర్యుడు చెళ్ళపిళ్ళ వేంకటేశుఁడున్
ప్రాణము ప్రాణమైన గుణరమ్యుడు కాటురి వేంకటేశుడున్.

# రసాలము

పింగళి - కాటూరి

కాలవశమ్మునన్ విసరుగాడ్పులకున్ ముదురాకు పుట్టముల్
రాలఁగ, బాటసారులఁ బరామరిసింపఁగ లేక సంపదల్
దూలిన దాతవోలె జిగిదూలిన యీ యెలమావిగున్న యా
కాలవశమ్ము చేతనె సఖా! వికసించెడిసొరు గంటివే.

చూచు కొలంది వింతలగు చున్ మనమున్ గరగించి నన్నుఁ బ్రే
రేచఁదొడంగె నీదు నును రెమ్మలకై వడి మోసులెత్తు వా
చా చతురత్వమంతయు రసాలమ! నీపయిఁ జూపుమం చదే
నీ చివురాకు తళ్కులును, నీ పువుగుత్తుల కుల్కునవ్వులున్.

పరిణత సత్వలమ్ముల, సువాసనలీను సుమమ్ములన్, మనో
హరమగు తేనెదొన్నెల, లతాంత రజమ్మను కుంకుమమ్ముఁ బ
ళ్ళెరమున నించి, చేతఁగొని లేనగ వొప్పగఁ దోఁటవాకిటన్
సురుచిరమూర్తితో నిలుచు శోభన దేవత వీవు భూజమా!

కలిమి దొలంగి యత్నములు గాలికిఁబోయి విచారమేఘముల్
దలముగఁ జుట్టుకొన్నఁబరితాపము చెందుటెకాని, యెన్నడున్
దెలియక పోతి, జీవమునఁ దేజమొకండు నశింపకున్న నీ
వలె మధుమాస సంజనిత భాగ్యము లందెదనన్న ధర్మమున్.

పాయన్‌జాలను నిన్ను, నన్ విడకుమీ ప్రార్థింతు, నీపండ్లుగా
నీ యాపూవులుగాని క్రొన్ననలుగానీ చేత ముట్టన్ జుమీ
నీయానన్ వచియింతు నమ్ముము, నినున్ వీక్షించుచున్ జొక్కి నీ
ఛాయా శీతల సైకతస్థలి మనశ్శాంతిన్ గనుల్‌మోడ్చెదన్.

తలిరాకు జొంపమ్ము తళుకునిగ్గులు
నాదు నేత్రయుగ్మమ్మున నిండనిమ్ము
పూఁదేనియల చొక్కపుం దీపు రుచులు
వాగ్విలసంబునకు లభింపనిమ్ము
కళుకు బంగరుచాయ గల పండ్ల మిసిమి
శరీరమ్మునకు నావరింపనిమ్ము
పూవుగుత్తుల కమ్మతావులు నా
యూర్పుగాలితో నైక్యమ్ము గాంచనిమ్ము

ప్రకృతి సౌభాగ్యమంతయు రాశియైన
విధమునన్ దోచుచుంటివి, వెదకి వెదకి
యీసరికి లభ్యమయ్యె నుపాసనాధి
దేవత యటంచు నిన్ను నర్థించుచుంటి.

జంతుకోటికి సంతాప జనకమైన
చండభాను నికరసహస్రమ్మునుండి
యమృతము గ్రహించుశక్తి నీయందెకలదు
దాని దయసేయుమమ్మ! యీతనికి సుంత.

❁ ❁ ❁ ❁ ❁

''జీవితం ఒక మహాసముద్రం కావచ్చు
కానీ, ఆశలనే నావతో దాన్ని ఈదెయ్యవచ్చు''

--శేషేంద్ర

❁ ❁ ❁ ❁ ❁

''కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం
రెప్పపాటే కదా ఈ ప్రయాణం''

-సమాఖ్య/చంద్రసేన్

# అక్షరాలను మలిన పరచని కవి

**- పాపినేని శివశంకర్**

'ముట్టుకుంటే తగలాలి కవిత్వం
మనిషి లాగ!
నరాల్లో ప్రవహించే రక్త పుష్పాలు
వెచ్చగా తాకిపోవాలి' (చిత్ర దీపాలు)

కవిత్వంలో మానవీయతని స్పృశిస్తున్న కవి ఎన్. గోపి. తెలుగు సాహిత్యంలో ఒక స్తబ్దత ఏర్పడ్డ దశలో కలంపట్టి తన చైతన్యానికి దారీ, దరీ నిర్ణయించుకున్న కవి. దారి పక్క బంగరు 'తంగేడు పూలను' చూసి (1976), 'మైలు రాళ్ళను' దాటి (1982) 'చిత్ర దీపాలు' వెలిగించి (1989) ఇప్పటికి 'వంతెన' మీద (1993) మజిలీ వేసిన మనిషి. సమకాలిక సాహిత్యోద్యమాలతో పూర్తిగా మమేకం కాకున్నా సామాజిక వర్తమానతకి స్పందిస్తున్న మనిషి.

వర్తమాన వ్యవస్థ పట్ల ఏదో ఒక స్థాయిలో అసంతృప్తి లేని వ్యక్తి ఆధునిక కవి కాలేడు. అతను ప్రకృతి గురించో, ప్రేమ గురించో, అలౌకిక దేశభక్తి గురించో తాపీగా ఏ ఒత్తిడీ లేకుండా రాసుకు పోగలడు. మరి ఆధునిక కవి ఆధునిక జీవిత వైరుధ్యాల్ని పట్టుకోవాలి. కారణాల్ని, పరిష్కారాల్నీ అన్వేషించాలి. బాధలకి కదలబారాలి. అన్యాయాలకి కదలబారాలి. మొత్తం మొత్తంగా వర్తమాన వ్యవస్థ సారాంశమైన అమానవీకరణకి వ్యతరేకంగా కదలబారాలి. అశాంతి రేఖ మీదే ఆధునిక కవి ప్రయాణం. 'అందరూ హాయిగా ఉండేదాకా ఈ అశాంతి కొనసాగుతుంది.'

వ్యవస్థా స్వభావం పట్ల తీవ్రమైన ఆగ్రహం గోపీ కవిత్వంలో కన్పించకపోయినా ఆధునిక కవి కుండాల్సిన అశాంతీ అసంతృప్తీ కనిపిస్తాయి. గోపీ విప్లవ కవి కాడు. (విప్లవ సాహిత్యోద్యమానికి అతను ఎడంగానే ఉన్నాడు.) ప్రగతి శీల కవి. అతని కవిత్వంలో అగ్నిని చూడలేకున్నా ఆర్తిని చూడగలం. ముఖ్యంగా తెలంగాణా పల్లెల బతుకు వెతల్ని చాలా దగ్గరగా చూపించ గలిగాడు గోపీ.

'జర నా కొడుకును జూడుండ్రి దొరా
మొన్న బాగుండె నిన్న బాగుండె
సెంప లుచ్చినయి పెయ్యి వాసింది
..............................
పేదరాలి రోదన విని తల పైకెత్తాడు డాక్టరు
మీ వోనికి రోగమేం లేదు
మాల్ న్యూట్రిషన్
అంటే తిండి గావాలె, మంచి తిండి' (తంగెడు పూలు)

'ఏ షాలు మారినా దోసాలు మారని' దొరలు పల్లెల కొచ్చి చేసే దొంగ పరామర్శల్ని విమర్శించాడు. అక్కడ 'బాల్యసంధ్య' లోనే అస్తమిస్తున్న పసివాళ్ళ మీద జాలి చూపించాడు. పల్లెలో బతకలేక పొట్ట చేతబట్టుకొని పట్నాలకు వలస పొయ్యే 'రాజయ్య' లాంటి వృత్తి పని వాళ్ళ విషాదాంత జీవితాల్ని విశ్లేషించాడు. మారిన సామాజిక వాతావరణంలో చాలాకాలం తర్వాత తన పల్లెకు వెళ్ళినప్పుడు 'నా చిన్నప్పటి ఊరు లేదక్కడ' అని గమనించాడు. 'వీధులు రాజకీయ కోరలు నూరుతున్నాయి'. ఆత్మీయ బంధాలు నలిగిపోయి 'పల్లెల్లో తల్లి వొడి కరువైంది.'

తనకు బాగా తెలిసిన విషయం గనుకనే తెలంగాణా పల్లెల జీవితాన్ని బాగా ఆవిష్కరించగలిగాడు గోపి. తనకు బాగా తెలిసిన భాషలోనే అత్యంత సహజంగా ఆవిష్కరించాడు. అక్కడ కృత్రిమ త్వానికి చోటు లేదు. కాబట్టి తెలంగాణా మాండలికం అప్రయత్నంగా జొరబడింది. సహజ సంభాషణా శిల్పమూ జొరబడింది. పది రోజుల పచ్చి బాలెంత పచ్చి కట్టెల కోసం వానలో తడుసు కుంట పోయి రోగం పాలైనప్పుడు ఎలా రాశాడు గోపి?

''ఏమైంది శాంతమ్మా ఏమైంది?
పెయ్యిల బాగ లేదు బాంచెన్
పచ్చి రెక్కల తోటి పచ్చి కట్టెలకోసం
శాంతమ్మా ఎందుకు వోయినవ్ శాంతమ్మా?'' (తంగెడు పూలు)

హృదయమున్న డాక్టరు ప్రశ్నకు జవాబు రాకుండానే శాంతమ్మ చచ్చిపోయింది. రెక్కాడితే గాని డొక్కాడని బతుకులవి. వాటిని వాటి భాషలో మాత్రమే సరిగ్గా వ్యక్తం చెయ్యగలడు కవి.

గోపీ కవిత్వం సాధారణత్వం నుంచి క్రమక్రమంగా నిర్దిష్టత్వం వైపు ప్రయాణించింది. ఉదాహరణకి 'చిత్ర దీపాల్లో' 'ఫ్రీడమ్ ఫైటర్' నిర్దిష్ట కవితా వస్తువు. 'వేళ్ళ కొసల మీద వందేమాతరం పూసల్ని దొర్లిస్తూ, కనపడ్డ ప్రతి వాణ్ణీ అపరాధిని' చేసే ఫ్రీడమ్ ఫైటర్ అతను. ఒకప్పుడు దేశం కోసం 'సమస్తాన్నీ తృణంగా ఊదేసి గోచిగుడ్డకోసం యాచిస్తున్న' వాడు. జీవిత చరిత్ర తప్ప అతని జీవితంలో మరి విలువైందేమీలేదు. 'ఆధునిక విపణి వీథుల్లో అలనాటి సాహసాలు అమ్ముడు పోవు.' 'ఆదర్శం పేరా ఆశయం పేరా జీవితాన్ని రోడ్ల పాలు చేసుకున్న' ఆ వెర్రివాడి మీద ముందుగా మనకి జాలి కలుగుతుంది. ఆ తర్వాత దేశ స్వాతంత్ర్యాన్ని సరిగా కాపాడుకోలేని మన అసమర్థత మీదే మనకి అసహ్యం కలుగుతుంది. అపరాధ భావన కూడా కలుగుతుంది.

'వంతెన ' కవితాసంపుటిలో 'రక్తపాత నగరం' 'వార్-91', 'కఫన్', 'స్తబ్ధ సంచలనం' మొదలైన కవితలన్నీ నిర్దిష్ట సామాజిక సంఘటనలపట్ల కవి స్పందనలే. ఇవీ, ఇంకా ఇలాంటి కవితల్లో గోపీ 'బుద్ధుని దేశంలో అన్నీ అహింస పేరనే జరుగు'తున్న అకృత్యాలను ఖండిస్తాడు. రాజకీయ (మత) కల్లోలాల్లో రోడ్ల మీద ప్రవహించే మృత్యువును చూపిస్తాడు. మొత్తం మీద మనిషిని అమానవుణ్ణి చేసే పెట్టుబడి దారీ, సామ్రాజ్యవాద సంస్కృతుల్ని హృదయ పూర్వకంగా వ్యతిరేకిస్తాడు. గోపీ రచనల్లో తక్కినవాటికన్నా 'వంతెన' సమకాల సమాజానికి బాగా expose అయిన కవిత్వం. ఇది ఆ కవిలోని క్రమాభివృద్ధికి నిదర్శనం.

తన అనుభవానికి అందని విషయాల గురించి - ఏవో కొన్ని సాధారణీ కరణాల మీద ఆధారపడి- గోపీ ఎక్కడా రాయలేదు. తన కవిత్వం తన అనుభవంలోదే. ఇందులో బాహ్యానుభవమూ (external experience) ఉంది. అంతరానుభవమూ (internal experience) ఉంది. 'భ్రష్టుడా! అమ్మ రుణం తీరదు, అమ్మకు అమ్మవై పుడితే తప్ప' అన్నప్పుడూ,

'మా అమ్మాయి నా భుజాలదాకా ఎదిగి
నన్ను ఎత్తుకో నాన్నా అన్నప్పుడు
బాల్యాన్ని వీడటం ఇష్టంలేని నా బిడ్డను చూసి
ఎంత బాధ పడ్డానో'

అన్నప్పుడు కవి గోపీ అంతరానుభవాల్ని ఎంత ఆర్ద్రంగా పలికించ గలడో తెలుసుకోగలం.

కవి అంతరానుభవ నైశిత్యానికి 'వంతెన' కవితా సంపుటిలోని 'బిస్మిల్లాఖాన్' కవిత ఉత్తమ ఉదాహరణ. కళల్లో సంగీతం మిక్కిలి అమూర్త కళ (abstract art). దాన్ని ఆస్వాదించటం తేలికే కావచ్చు. ఆ ఆస్వాదనని వర్ణించటం, భావచిత్రాల్లో బంధించటం ఎంతో కష్టం. బిస్మిల్లాఖాన్ ది 'సన్నాయి వెన్నెల!' అన్నాడు గోపీ.

' వాడి ఊపిరినిండా భూగోళం కరిగి కరిగి
కన్నీరై సెలయేరై జలపాతమై దూకిన నిశ్శబ్ద నాదం!
రోప్ వేకు వేళ్లాడుతూ లోయలపై చేసే పచ్చ పచ్చని ప్రయాణం
గులాబీలతో రాళ్ళను పగులగొడుతున్న అపురూప శబ్దం!'

సన్నాయి సంగీతంలోని మృదు కాఠిన్యం అది.'రాగంబిడ్డా! అది రాగం' అంటూ కవి గోపీ 'పరిమళంలా వ్యాపించే ఆ అలౌకిక స్థితి'ని అత్యద్భుతంగా ఆవిష్కరించాడు.

స్పష్టమైన సరళమైన కవిత్వం గోపీది. కొత్త కొత్తగా చెప్పాలని కానీ, గడుసుగా గమ్మత్తుగా చెప్పాలని కానీ ఎక్కడా తాపత్రయ పడలేదు. 'నిజజీవితంలో వ్యంగ వైభవం లేని సాదా మాటలే నా కిష్టం' (మైలురాయి) అన్నాడతను. కవిత్వంలోనూ మెరమెచ్చుల జోలికి పోకుండా చెప్పదలుచుకున్నది సూటిగా చెప్పేసి కాస్తంత ఆలోచనకి చోటివ్వటమే తన కిష్టం. కవిత్వం చేతబూని పాఠకుడి మీద దాడిచెయ్యటం అతని పద్ధతి కాదు.

స్పష్టతకీ గాఢతకీ కవిత్వంలో వైరుధ్యమేం లేదు. కవి అసమర్థుడైనప్పుడే ఆ వైరుధ్యం ఏర్పడుతుంది. స్వచ్ఛత లేకపోతే స్పష్టత కూడా రాదేమో. ఒకప్పుడు కాశ్మీర్ లోయల్లో కొన్ని జలప్రవాహాలు చూశాను. ఎంత లోతుగా ఉన్నాయో అంత స్వచ్ఛంగానూ ఉన్నాయి నీళ్ళు. ఎంత స్వచ్ఛంగా ఉన్నాయో అంత రుచికరంగానూ

ఉన్నాయి. అదుగో అట్లా కవిత్వంలోనూ ఎందుకు సాధ్యంగాదూ అని నా ప్రశ్న. దాని కొక జవాబు గోపీ కవిత్వం. 'కట్టుకున్న బట్టలు వదిలేసి పద్యాలు కప్పుకున్నాడు' అని 'వేమన్న' ని వర్ణించినప్పుడు ఆ వర్ణన ఎంత సరళంగా ఉందో అంత గాఢంగానూ ఉంది.

'తీగె మీద నీటి ముత్యాలు నడిచి పోతున్నాయి
తడి రెక్క లల్లారుస్తూ పిచ్చుక లాడుకుంటున్నాయి
పాల పొర లారవేసి నట్లున్న దాకాశం
కొబ్బరాకుల మధ్య చలిగాలి చప్పుడు చేస్తున్నది' (తంగెడు పూలు)

అని 'వాన వెలిసిన వేకువ' ని వర్ణించినప్పుడూ ఆ దృశ్యంతో పాటు కవిత్వమూ ఎంతో సహజంగా ఆహ్లాదదాయకంగా ఉంది.

ఈ మధ్యకాలంలో కవిత్వం స్థూలస్థాయి (Macro level) నుంచి సూక్ష్మస్థాయికి (Micro level) చేరింది. మానవీయ స్పందనలకు తావులైన ఏ చిన్న అంశాల్నీ కవులు వదలి పెట్టటం లేదు. గోపీ రాసిన 'ఓ రోజు' 'ఇన్విజిలేషన్' 'వ్యూ పాయింట్' సూక్ష్మస్థాయిలో మంచి కవితలు. వాటిల్లో అంశం కంటే దృగంశం గొప్పది.

సాహిత్యరంగంలో ఇవాళ వర్ణవాదం తలెత్తుతోంది. సామాజిక జీవితంలో కులమతాల పాత్ర గుర్తించటం అవసరమే. అయితే ఆ గుర్తింపు చివరికి కులమతాల నిరాకరణకే దారితీయాలిగానీ మనిషిని ఇంకా ముక్కముక్కలు చెయ్యటానికీ మనుషుల మధ్య విద్వేషాలు పెరగటానికీ దారితీయరాదు. ఈ వాతావరణంలో ఎన్నడో గోపీ రాసిన 'బయోడేటా' కవిత ఇప్పటికీ మంచి అవగాహనే కలిగిస్తుంది. 'అయ్యా! మీదే కులం?' అనే ప్రశ్నకు 'యువకులం' అనే జవాబు వస్తుంది. 'పేరేమిటి?' అంటే 'నవగళం' అనే జవాబు వస్తుంది. 'ఏం పని?' అంటే, 'దీన జనుల సందోహపు సంక్షేమం' అని ప్రత్యుత్తరం. కవి కంఠం ఇంతకంటే చెప్పాల్సిన జవాబేం లేదు.

గోపీ కవిత్వానికి అతని పరిశోధనాకృషి అడ్డుపడక పోవటం ఆశ్చర్యకరమే. కవిత్వం, పరిశోధన (లేదా విమర్శ) విరుద్ధ విషయాలు. మంచి పరిశోధకులు మంచి కవులైన సందర్భాలు అరుదుగా ఉంటాయి. ఈ మధ్య కాలంలో మౌలిక పరిశోధకులు కూడా తగ్గి పోయారు. 'వేమన్న వాదం'(1979), ప్రజాకవి వేమన (1980), 'వ్యాస నవమి (1987), 'వేమన పద్యాలు పారిస్ ప్రతి' పరిష్కరణ (1989) మొదలైన రచనలు

గోపీ పరిశోధనా ప్రాగల్భ్యాన్ని తెలియజేస్తాయి. ఎన్. గోపి 'వేమన గోపి'గా పేరుబడటమే విమర్శరంగంలో తన కృషికి గుర్తూ, గుర్తింపూ.

గోపీ కవిత్వంలో ఒక రాజకీయ సిద్ధాంత నేపథ్యం బలంగా కన్పించదు. అందు వల్లనే కాబోలు కొన్ని చోట్ల వ్యక్తీకరణలో ఉండాల్సిన పదును కూడా కన్పించదు. అక్కడక్కడా కొంత పలచదనం కూడా ఉందనిపిస్తుంది. కొట్టొచ్చే విధంగా కవిత్వీకరణ కోసం తను పాకులాడకపోవటమే ఇందుకు కారణమై ఉండాలి.

దశాబ్దాల తరబడి తమ కవిత్వంలో చూపించిన నమ్మకాల్ని రాత్రికి రాత్రే గాలి కొదిలేసి దశలు మార్చి, దిశలు మార్చి సరికొత్త హొయల్లతో గొంతులు సవరిస్తున్న సాహిత్యకారుల మధ్య మన మున్నాం. ఈ నేపథ్యంలో, దాదాపు పాతికేళ్ళుగా స్థిరమైన ప్రగతి శీల దృక్పథంతో నిదానంగా నిబ్బరంగా సాహిత్యకృషి చేస్తున్న డాక్టర్ ఎన్. గోపిని అభినందించాల్సిందే.



---

## వెన్నెల్లో గోదారి

ఇవాళ పొద్దున్న
చంద మామను పట్టుకొని
ఏ పేపరు మిల్లులో పారేశారో ఏమిటో
ఇక్కడి కొచ్చి చూస్తే
గోదావరే పెద్ద తెల్ల కాగితం !
దాని మీద కవిత్వం రాయడానికి
ఆ సూర్యుడే దిగిరానక్కర్లేదు,
నే నిక్కడ నిలబడి
చిన్నరాయి పడేస్తే చాలు!

–వసీరా

# బయోడేటా

శ్రీ ఎన్. గోపి (గోపాల్) నల్లగొండ జిల్లా భువనగిరిలో 1950 జూన్ 25న జన్మించారు. హైస్కూలు దాకా సొంత ఊరి చదువు, హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉన్నతోన్నత విద్య. బియ్యే ఎం.ఏల్లో బాగా చదివినందుకు రెండు స్వర్ణపతకాలు. 1979లో 'ప్రజా కవి వేమన' పై పరిశోధన చేసి డాక్టరేట్ పట్టా పొందారు. లింగ్విస్టిక్సులో పి.జి. డిప్లొమా చేశారు. 20 యేళ్లుగా తెలుగు అధ్యాపకత్వం. ప్రస్తుతం ఉస్మానియా తెలుగు శాఖలో ప్రొఫెసరుగా, పాఠ్యప్రణాళికా సంఘం అధ్యక్షులుగా వున్నారు.

వీరు 4 నాలుగు కవితా సంపుటాలను ప్రచురించారు. అవి తంగేడు పూలు (1976), మైలురాయి (1982), చిత్ర దీపాలు (1990), వంతెన (1993). తంగేడు పూలు, మైలురాయికి వరుసగా దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డు, ఫ్రీవర్స్ ఫ్రంట్ అవార్డు లభించాయి. అలాగే 'చిత్ర దీపాలు' కు తెలుగు విశ్వవిద్యాలయము వారి ఉత్తమ కవితా బహుమతి, సినారె కవితా పురస్కారం లభించాయి.

కవిత్వంతో పాటు వీరు 'ప్రజా కవి వేమన' అనే సిద్ధాంత వ్యాసం, 'వ్యాసనవమి' పరిశోధక వ్యాస సంపుటి, 'వేమన పద్యాలు - పారిస్ ప్రతి' (ఫ్రాన్స్‌లోని కింగ్స్ లైబ్రరీ నుంచి తెప్పించిన క్రీ. శ. 1730నాటి ప్రతి సముద్ధరణ, పరిష్కరణ, తొలి ప్రచురణ, 'వేమన్న వాదం' ఎన్నిక చేసిన వేమన ప్రాతినిధ్య పద్యాలకు వ్యాఖ్యానం మొదలైన గ్రంథాలను రచించారు. వివిధ పత్రికల్లో అనేక సాహిత్య వ్యాసాలు ప్రచురించబడ్డాయి. పదిహేనో యేట పద్యాలతో ప్రారంభమైన రచనా జీవితం 1969లో వచన కవిత్వంలో అడుగిడింది. 'శశీ' అనే శతకం, ఇంక అనేక పద్య కావ్య ఖండికలను తొలినాళ్ల రచనలుగా చెప్పవచ్చు.

---

''సముద్రం ఒకడి కాళ్ళదగ్గర కూర్చుని మొరగదు
తుఫాను గొంతు చిత్తం అనడం ఎరగదు
పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు.''

–శేషేంద్ర

---

# ముసురు

డా. ఎన్. గోపి

పొద్దుటి నుంచి ఒకటే ముసురు
గుండెలోంచి భూకంపశవాల్ని వెలికి తీస్తున్నాను.
ఏవేవో నీడల విసురు కదలికలు.
బతికివున్న మనం నిజంగా బతికే వున్నామా!
ఊహాకే వదిలేద్దాం
ఎన్ని నరకాలను గుణిస్తే ఆదుఃఖం!
కవిత్వంతో నటించడం నా వల్లకాదు.
మరోజననం మరణాన్ని అర్థవంతం చేస్తుందా?
బతికి వున్న మనల్నే తీసుకుందాం
ఎన్ని ఎన్ని ప్రకంపనాలతో కూలి పోతున్న
ఆంతరిక శిథిల ప్రపంచాల్ని మోస్తున్నాం.
అయిన వాళ్ళందరూ మట్టిలో మట్టయ్యారు.
అయితే
ఇసుకలో నీళ్లింకినంత తేలిగ్గా రక్తం ఇంకదు.
భూకంపం గురించి పద్యం రాసే ధైర్యం లేదు నాకు.
భూమి తల్లి వొడిలోనే దగా జరిగిందనీ
గర్భశోకమే ఆమెకు మిగిలిందనీ ఇలా ఇలా రాయలేను.
మన బాధ అంతటితో ఆగితే అదిగదా......
ఒకేసారి వచ్చే మృత్యువును లెక్క చేసే దెవడు?
అసలు మృత్యువు మన జీవితాల్లో ఏనాడో చొరబడింది.
స్నేహ సంబంధాల ఓజోన్ పొర గాయపడింది.
మాటలు మకిలి పట్టాయి.
పాత్రల్ని తోముకుని వాడుకుంటున్నట్టు
మాటల్ని శుభ్రపరచుకొని ఎన్నాళ్లు వాడుకుంటాం?
ఆత్మలోకంలో కొత్త మాటల ఆవిష్కారం ఆగిపోయింది.
మనసుని శరీరంతో మేళవించి శ్రుతి చేయడం మరిచి పోయాం.

ఎటుచూసినా విశ్వాసాలు దగ్ధమౌతున్న దృశ్యాలు
వీథుల్లో మనుషుల రూపంలో శ్మశానాలు నడుస్తున్నాయి.
నువ్వు నిద్రపోయిన తర్వాత కూడా
తారలు బయటికి రావటంలేదు.
పక్షులు పిలిచినా సూర్యుడు వినటంలేదు.
మృత్యువు ఏనాడో తలుపులు మూసేసింది,
తెరచి వున్న రెప్పల్ని చూసి సజీవం అనుకుంటున్నాం.



## సామగ్రి

పొద్దుటి పూట
అసెంబ్లీ ముందు
ఊడ్చే వాళ్ళకు
నిన్నటి నినాదాలు దొరుకుతాయి.
కుప్పను
గంపల కెత్తేటప్పుడు
గాజు పెంకుల్లా
''హామీ'' లు గుచ్చుకుంటాయి.

## వేమన

అతడు నడుస్తుంటే
అడవులు కూడా భయపడ్డాయి
నడచినంత మేరా
దారంతా అంటుకుంది.
......................
కట్టుకున్న బట్టలు వదిలేసి
పద్యాలు కప్పుకున్నాడు
దేశమంతా తిరిగి తిరిగి
తన్ను తాను పట్టుకున్నాడు.

- డా. ఎన్. గోపి

# భావ ఉగాది

- మారుతీ శ్రీ లత

ఉగాది కన్యా ! నీకు స్వాగతమివ్వనా !
గడచిన గతాన్ని నెమరు వేసుకొని
వర్తమానానికి హారతివ్వనా ?
చేదు, తీపి, పులుపుల మకరందాన్ని అందించే
ఉగాది కోయిలా!
గొంతదేల విప్పవమ్మా?
కాలం మారిందనా ?
నీ కుహూ కుహూ రవాలతో తెల్లారనివ్వని
ఆధునిక ప్రపంచాన్ని చూసి
జాలి పడుతున్నావా?
గున్నమామి తోపు చూడని ఆధునిక
గుంటలను చూసి అలుక పూనావా?
వచ్చీరాని,పరాయి భాషల మమకారంలో పడి
సంస్కృతిని మరచిన యువతను చూసి
వేదన పడుతున్నావా?
పంచాంగం చదువరాని
పండితులను చూసి
పక పకా నవ్వుతున్నావా?
శుభ సంవత్సర శుభోదయాన
ముద్దుగా పలుకుతూ రామ్మా
' నా కోసం ' కొన ఊపిరితో నున్న
మన 'సంస్కృతి' కోసం
మహోన్నతమైన మన చరిత్ర కోసం
నీ రాక నాకానందం
క్రొత్త కోకతో వలపుల రవికతో
చిఱు ధ్వనుల గాజులతో

ఘల్లు ఘల్లున మ్రోగే మువ్వలతో
జడనిండా పూలతో చిఱునవ్వుల మోముతో
హారతినిస్తాను రామ్మా!
ఉగాది కన్యా, ఉగాది కోయిల
కుహూరవాల మేళవింపులతో
వసంతపు రంగుల రంగవల్లులతో
గుమ్మాన కట్టిన తోరణపాకుతో
అతిథి దేవుల ఆదరింపులతో
తెలుగు పడుచులా
ఆహ్వానిస్తున్నా అర్థిస్తున్నా
ఉగాది లక్ష్మీ! రావమ్మా
మా ఇంట వెలుగు దివ్వెగా!!



వర్షం వెళ్ళిపోయింది
మబ్బుల రథాలెక్కి
జలదానం చేసిన మేఘాలకి
జోహార్లు చెప్పాయి చరాచరాలు.
భూమిలో ఉన్న చిన్నారి గింజ
మెడ బయటపెట్టి
మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది
కృతజ్ఞతతో .....

- శేషేంద్ర

# రెండు శిబిరాల మధ్య

- పెన్నా శివరామకృష్ణ

అనుబంధాల ఆత్మీయతల మెడల మీద
ఆలోచనల అసిధార
ఆలోచనకు ఆలోచనకు మధ్య
ఎల్లలు లేని స్వయంనిర్మిత సహారా
దేహసూచీ ముఖం మీద
అనుభూతుల పాదరస వర్షం
బ్రతుకొక బిసరుహ పత్రం
అంతా విచ్ఛేదన - విచ్ఛేదన
డిటాచ్‌మెంట్ - డిటాచ్‌మెంట్

* * * * *

ఆశా రాహిత్యంతో పోరాడుతున్నదెవరూ లేరు
పోరాడకుండా బ్రతికివున్న దెవరూ లేరు
మాకు రంగులూ వద్దు - రాజకీయ సరంగులూ వద్దు

* * * * *

మనుషులెందరో ప్రపంచాలూ అన్ని
మనసులెన్నో సముద్రాలూ అన్ని
వస్తువు ఏదో కొలమానమూ అదే
దేహధరిత్రి
మనోగగనం
విషాదాశ్రువు
వివేకతేజం
ఆవేశప్రభంజనం
అంతా అగాధం - అగాధం
బయటా లోపలా చివరికి 'ప్రకృతే' సహచరి

* * * * *

పగిలిన మధుపాత్రలతో స్మృతుల సంవాదాలూ
భవిష్యత్ స్వప్న పరీరంభ బింబాలూ
చూపుల నావలను గురిచూసే కాంతిసాగర గహ్వరాలూ
అన్నీ కళ్ళముందు బంధిత కవాటాలే
తస్మాత్ జాగ్రత్త - జాగ్రత్త

వర్తమాన రేఖకు
ఇరువైపులా రెండు శరణార్థి శిబిరాలు
పలాయన మధ్యమాలు
భద్రత ఒక్కటే ప్రమాణం
విజయ మొక్కటే తార్కాణం

రహదారి ఒక నిగూఢ కావ్యం
ప్రేయసి రాసిన ఉత్తరంలా
మరోసారి మరోసారి చదువుకోవాల్సిందే!

(రచన సాగుతున్న కావ్యం 'జీవనది' నుండి)

---

''కాకి జీవితౌన్నత్యము కష్టపడువానికి తెలియును
కోకిల ఘనత కూర్చుండి కూనిరాగము తీయువానికి
అవగత మగును''

* * * * *

''కల్లునకు కంపు ఎక్కువ
తేనెకు వాసన ఉండదు''
(- దిగుమర్తి సీతారామస్వామిగారి 'హిమాని' నుండి)

# అవిస్మృత యాత్ర

- పెన్నా శివరామకృష్ణ

గుప్తమైన వ్యధకు ఆరంభం ముగింపు
ఒకే బిందువు దగ్గర.

అశ్రువు నుంచి అశ్రువుకున్నంత సామీప్యంలో
మానవ కథా గమనమంత సుదీర్ఘంగా
రెండు అడ్డుగీతలు

గడియ పడిన గదుల మధ్య
కరిగిన కళ్ళ ఖండిత ప్రవాహం

తడిసిన పుస్తకంలో ఇరువైపులా
ముద్రిత మయూర నేత్రద్వయం

ఏనాడో సిగనుంచి రాలిన
సంఖ్య లేని ఫెటిసిస్టు రోజాపుట
పురాతన మౌన పరీమళం

దయానిధి దాచుకున్న కేశం
ఒక ఐచ్ఛిక క్లేశం

ఆగిపోయిన ఆటలో
చీలిన నీడల మధ్య
విరిగిన వెలుతురు బొమ్మల ఆల్బమ్

మరణానంతరం కూడా
తెరిచిఉన్న కన్ను మాత్రమే
అనంత నిరీక్షణకు ఆఖరి హద్దును
చెరిపేస్తుంది.

జనన మరణాలకు బీజాలు
దాచుకున్న క్షణాలేనని
ఆలస్యంగానే తెలుస్తుంది

కుమ్మరి పురుగు
ఆత్మను హేమంత వృక్షంగా మారుస్తుంది

ముక్కలుగా విరిగిపడుతున్న
ప్రేమికుల పెదవులు పదను పెట్టిన
సంక్షిప్త మహావాక్యానికి
ఆమె, నేను చెరోవైపు...

తీరా ఇంత చేసి
ఆత్మలోతును గాయాలతోనే
కొలవాలని ఎవరూ చెప్పరు
గాయాలను బాణాలతోనే
మాన్పుకోకా తప్పదు

ప్రపంచాన్ని ప్రేమచిహ్నంగా
ఇక్కడ దాచుకొని
మరిచిపోయారెవరో?
(రచన సాగుతున్న కావ్యం 'జీవనది' నుండి)

---

''భావములు నడచి పోవగా నేర్పడిన
పద చిహ్నములే అక్షరములు''

❋ ❋ ❋ ❋ ❋

''తురాయి రాజు మూర్ధమును చిరకాలము
తానే అధిష్టించును,
పుష్పమో, అటుకాక తన స్థానమును
తన వంశీయుల కొఱకు విడిచి పెట్టి పోవును''

**(– దిగుమర్తి సీతారామస్వామిగారి 'హిమాని' నుండి)**

# నన్ను దూరం చేసుకొన్నవాళ్ళు

-రాజేశ్వరీ దివాకర్ల

నన్ను దూరం చేసుకొన్నవాళ్ళు
పునాదుల్లో చలువ పందిరిగా వెలసిన దాన్ని
మమతల మబ్బుల్లో
వెండి తీగె మెరిసినపుడు
వెన్నెల వరదనై వెల్లి విరిసినదాన్ని,
మెట్టినింట కాలు పెడుతూ
పుట్టినింటి అడుగు జాడల ముద్ర
భద్ర పరచుకొన్నదాన్ని
ఇంకొక ప్రపంచం
నన్నావరించి వున్నా
సహజ పరిమళాలను
చిన్ననాటి రెండుజడల రిబ్బనుముడిలో
దాచుకొన్న దాన్ని,
నన్ను గుండెలకు హత్తుకొని పెంచిన వాళ్ళు
పండుగకు
పిలిచి
నన్నూ నాపెట్టెనూ కానుకలతో నింపి
అతిథులుగా
ఆదరిస్తూ
తిరుగు ప్రయాణానికి
మంచి ముహూర్తం వెతుకుతున్నప్పుడు
మా మధ్య దగ్గరవుతున్న దూరంలో
మెరుస్తాయి
చెంపలకు జారని వేడి కన్నీటిచుక్కలు.

# పరిచయాలు

- రాజేశ్వరీ దివాకర్ల

నేను
కొండ చరియల్లోనే
సంచరించినా
కొండను
అద్దంలో మాత్రం చూచి
అందుకోలేక పోయాను.

నేను
నది ఒంపుల్లోనే పరిభ్రమించినా
నేనొక సముద్రాన్ని పోవాలని
నదిని కోల్పోయాను.

దినమంతా
జన మధ్యంలో కలిసి తిరిగినా
ఎవ్వరి చేతినీ అందిపుచ్చుకోను.
గట్టిగా గొంతెత్తి పిలవాలనుకొని
కంఠ నాళికలోనే
అడ్డగిస్తాను.

చెట్టు నాశ్రయించివుంటే
శాఖగా పల్లవించే దానిని,
కొండ నంటివుంటే
శిఖరాగ్రం చేరేదానిని,
నదీనదమైతే
సముద్రంలో శంఖమయ్యేదానిని.

పరిచయాలను పెనవేసుకొని
ప్రశంసింప బడక
చుక్కలు చుట్టుముట్టినా
ఒంటరియై వెలుగుతున్న
చందమామను చూచి
నిట్టూర్పులు వదులుతాను,
మనోగత స్వాగతాలతో
కడుపు నింపుకొంటాను,
కోల్పోయిన ఒకలోకానికి బింకం చూపుతాను,
స్వప్నలోక ద్వారం తెరుచుకుని వచ్చి
నాకు గుర్తింపు నివ్వాలని ఆశ్వసిస్తూ
జీవిస్తాను.

## సౌందర్యం లోంచి

**- రాజేశ్వరీ దివాకర్ల**

ఒక
సౌందర్యాన్ని తలపోసి
ప్రణయిని నయ్యాను.
ఎల మావి చిగురాకు నవోల్లాసం
కోకిల పాటల కమ్మదనం
సుమ మకరంద స్వాదనామయ
తుమ్మెద ఝుంకారం
ప్రహర్షించి
పూలశయ్య చేరాను.
పులకిత
గాత్ర పరిష్వంగం
స్వేద రోమాంచనం
అధర ప్రకంపనం

కోర్కెల తుట్టతుది అల
సముద్ర గర్భాన్ని తాకిన తీయని అనుభవం.
వసంతం
జారుకొన్న కనురెప్ప విప్పులో
పచ్చి బాలెంత శరీర శోషణం
నవ శిశూదయ రాగబంధం.
నేల బింకం సడలి
నడుము వంపుల్లో
కొల్లస్వరాలు పేరుకొన్న
గుండ్రని నిండైన విగ్రహం.
మాయ ధరించిన చీర కొంగు రెప రెపలో
కాలం కొనిపోతున్న దర్పణ ప్రతిబింబం
కోల్పోయి
మరేదో పొందుతున్న మంచు నీటి జ్ఞాపకం.
సౌందర్యంలోంచి
నిశ్శబ్దంలోకి
సాగిపోతుంది
పరిశ్రాంత జీవితం.

---

## ప్లీడరు

చంకలో పెట్టుకొని తిరిగే
కాగితం పులుల్ని
వాయిదాల వనంలో వదిలి పెట్టి
కేసుల్నీ కాలాన్నీ జీళ్ళపాకంలా సాగదీస్తూ
పార్టీ పర్సుల మీద
పండుగ చేసుకొనేవాడు.

**- ఆసు రాజేంద్ర**

---

# ఉదయానికి నమస్కారం

## -సాదనాల వేంకట స్వామి నాయుడు

శిఖరాగ్రానఉన్న వృక్షం
ఎప్పుడూ ఆకర్షిస్తూనే ఉంటుంది!
ఫల భారంతో నిండిన చెట్టు
రాళ్ళదెబ్బలకు గురి అవుతూనే ఉంటుంది.
చల్లని గుబురునీడై వ్యాపించినా
తీయని పళ్లరుచులు అందించినా
వడిసెలలు మాటేస్తూనే ఉంటాయి!
అయినా శ్రమస్వేదాన్ని సేద తీరుస్తూ
ఆకలి మంటలను చల్లారుస్తూ
తల్లి ఒడిలో ఓలలాడిస్తూనే ఉంటుంది!
ఎన్ని విషప్రభంజనాలు వీయనీ
ఎన్ని అగ్ని ఝంఝులు తాకనీ
ఆత్మీయ మేఘాలు రాక మానవు.
తిన్న ఫలాలతో జీవితాన్ని నిలుపుకున్న శరీరాలు
కాలి వేళ్ల దగ్గర కన్నీరు వొంచుతూ
పచ్చదనాన్ని తప్పక పరిరక్షిస్తాయి.
మహాత్మా!
హృదయం ఉన్నవారికే
ఉదయాలుంటాయి!!

( శ్రీ సి.నా.రె.కు....)

---

నేనింతా పిడికెడు మట్టే కావచ్చు
కానీ, కలమెత్తితే నాకు
ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది!
-శేషేంద్ర

# మంచు పండు

- భగ్వాన్

ఒక్కోసారి జలపాతంలా దూకుతున్నట్టూ
ఒక్కోసారి నిండు గోదావరిలా ప్రవహిస్తున్నట్టూ
నేను పాఠాన్ని తరగతి నిండా కమ్ముకుంటాను
పాఠం ప్రాణవాయువును పీల్చుకుంటూ పసి మెదళ్ళు
మొగ్గ - పువ్వుగా
రూపాంతరం చెందుతున్న దశలో ఉంటాయి
నేనూ విద్యార్థులూ ఒకరికోసం ఒకరు బతుకుతున్న
ఆ దాదాత్మ్యపు క్షణాల్లో ఉన్నట్టుండి
రసవత్తరంగా సాగుతున్న నాటకం మధ్యలో
చందాదారుల పేర్లు చదివినట్టు
మా ఏకాగ్రతను భగ్నంచేస్తూ
మా విజ్ఞాన ప్రపంచ ప్రాకారాన్ని పడతోస్తూ
గుమ్మం బయట డబ్బామూత చప్పుడవుతుంది
నిశ్చల నిర్మల తటాకంలోని ప్రతిబింబాలు
అలలు అలలుగా చెదిరిపోతాయి
నేను గుమ్మంలోంచీ పిల్లలు కిటికీలోంచీ
జానెడు పొడుగున మెడలు చాపుతాము
రహదారిపై కట్టిన 'సుస్వాగతం' వస్త్రతోరణంలా
బడిగేటు వద్ద ఐసు ఫ్రూట్ అబ్బాయి
డబ్బామూత వాద్యంపై ఆహ్వానగీతం వాయిస్తూ---
బడి దగ్గర ఐసు అమ్మకూడదని నేను వాడ్ని కసురుకుంటాను
వాడు చూపులతోనే నన్ను బతిమాలుకుంటాడు
వాడు చూపులతోనే తన కుచేల సంసారం చిట్టాపుటల్ని
ఒక్కొక్కటిగా నా ముందు తెరుస్తాడు
పెట్టెలోంచి తీసిన ఐసులా బొట్టుబొట్టుగా నేను కరిగిపోతాను
విరామ సమయం గంట కొట్టీకొట్టగానే
పిల్లలు జుయ్‌మంటూ వాడి చుట్టూ గుడి కడతారు

నట్టనడి వేసవి మధ్యాహ్నం నీటికోసం
సరస్సుచుట్టూ వాలిన రంగురంగుల పిట్టల్లా ఉంటారు పిల్లలు
వాడేమో
ప్రదక్షిణలు చేస్తున్న ముత్తయిదువుల మధ్య తులసికోటలా
చేతులెత్తి ప్రార్థిస్తున్న భక్తులకు విబూది పంచుతున్నబాబాలా
వేయి స్తంభాల మండపం నడుమ కల్యాణ వేదికలా
పుల్ల చుట్టూ ఐసు పేరుకున్నట్టు
అనేక అనుభూతి దృశ్య సౌందర్య పరిమళాలుగా నన్నల్లుకుపోతాడు
బరువెక్కిన జేబూ బరువు దిగిన గుండే
వాడి కళ్ళల్లో తృప్తి వజ్రాలై మెరుస్తాయి
వెళ్తూవెళ్తూ వాడు నాకో చూపు కృతజ్ఞత విసరి పోతాడు
ఎప్పుడో నా వద్ద చదువుకున్న విద్యార్థి గొప్ప ప్రయోజకుడై
నమస్కారం మాస్టారూ అన్నట్టుగా నామేను పులకిస్తుంది
ఇప్పుడు నాకు
మా బడి గంటలో వాడి డబ్బా మూత చప్పుడే వినిపిస్తుంది
ఇప్పుడు వాడు
మా బడి కాల నిర్ణయపు పట్టికలో పది నిముషాల పిరీయడ్డై పోయాడు
దూరంగా నిలబడి గుటకలేస్తున్న ఒక చిన్ని నోటికి
పెట్టెలో మిగిలిన
ఒకే ఒక్క ఐసుఫ్రూట్‌తో విందు చేసిన వాడి హృదయ సంస్కారం-
ఇంత సంపాదిస్తున్నా
ఒక్క పేద విద్యార్థికైనా ఉచితంగా ట్యూషన్ చెప్పని
నా మరుగుజ్జుతనాన్ని ఖండఖండాలుగా కత్తిరిస్తుంది
ఎండకూ గుండెకూ నడుమ మంచుధనుస్సునెత్తే వీరుడు వాడు
వాడు కనిపించేది రోజుకో పది నిముషాలే అయినా
పాఠ్యపుస్తకం తెరవగానే కనిపించే ప్రతిజ్ఞలా కంఠస్థమవుతాడు
ఇప్పుడు నా గుండె 'మంచు పండు' ఆకారంలోఉంది.

# మంగమ్మ

బి. హెచ్. అమర్‌నాథ్

మంగమ్మ గురించి చెపుతుంటే
నా ఇరవైరెండేళ్ళ నాటి అనుభూతుల్ని
మీతో పంచుకుంటున్నట్లే
మా యింట్లో అందరికీ ఆమె పనిమనిషే
నాకు మాత్రం ప్రేమ పంచి తీపిమాటలు నేర్పిన మనిషి
ఇప్పుడు నేను నడిచే నడకంతా
ఒకప్పుడు ఆమె చిటికెన వ్రేలు పట్టుకుని
నేర్చుకున్నదే
నా తోటివాడే ఆమె కొడుకుని కూడా
నన్ను ముట్టుకోనిచ్చేది కాదు
నేను తిని వదిలేసిన బిస్కట్ ముక్కలు మాత్రం
తీసుకోనిచ్చేది
ఏ పండక్కో ఓ పాత చీర
రాత్రి మిగిలిన అన్నం మెతుకులు
మాత్రం తీసుకుని వెళ్ళి పోయేది.
మళ్ళీ ఉదయం ఆమె స్పర్శ తాకగానే
రాత్రి కలలోకి వచ్చి భయపెట్టిన
భూతం గురించి మరిచి పోయేవాడిని
ఆమె కూడా అంతే
రాత్రి తాగొచ్చి భర్త కొట్టిన దెబ్బలపై
నా స్పర్శను లేపనంగా రాసుకునేది
అప్పుడప్పుడు నేను చేసిన చిలిపిచేష్టలకు
అందరి ముందు ఆమె దోషి అయ్యేది
ఇప్పుడు కూడా సంవత్సరానికోసారి
సెలవులకు ఊరెళ్ళినప్పుడు
ఆమె గుడిసెకెళ్ళితే
నా బట్టలకు తన పేదరికం ఎక్కడ
అంటుకుంటుందోనని
తన పైట చెంగునే చీపురుగా చేసి

తుడిచి నన్ను కూర్చోపెడుతుంది
ఆమె మాటలు వింటుంటే
చిన్నప్పుడు ఆమె వీపెక్కి ఆడుకున్న
గుఱ్ఱం ఆట జ్ఞాపకం వస్తూ ఉంటుంది.
నేను మీతో చెప్పుకుంటున్నట్లే
ఆమె నాతో చెప్పుకుంటుంది
తన బాల్యం నాటి జ్ఞాపకాలను.
నేను సంగీతమో, కవిత్వమో
పేరెత్తితే చాలు
ఆమె తన బాల్యం నాటి జ్ఞాపకాల్లోకి వెళ్ళి
చిన్నప్పుడు తన ఊళ్ళో
గోవుల గోపన్న పాడే వేణువునాదం గురించి
హరిదాసులు సైతం సీసపద్యాలు పాడే వారని
ఆమె చెపుతుంటే
నేను చేష్టలుడిగి ఉండి పోతాను
ఆమె కూడా అంతే
సంవత్సరంపాటు పడిన కష్టాలతో
కన్నీళ్ళు ఇంకిన కళ్ళతో
నా గుండెల్లో ఆర్ద్రత కురిపిస్తుంది
తిరిగి వచ్చేటప్పుడు సంవత్సరానికి సరిపడా
నెమరు వేసుకోవడానికి అనుభూతులు
మూటగట్టి పంపుతుంది.

---

**స్కూలు**

వానలో ఒంటరిగా తడిసిన
పెంకుటింటి బడి
రెక్కలు ముడుచుకున్న
తల్లికోడి.

–తల్లావఝుల పతంజలిశాస్త్రి

# ఉదయం ఉదయించనుంది

-అడిగోపుల వెంకటరత్నం

వాళ్ళు ఒక్క పాటనూ పాడలేరు
అన్నీ అపశ్రుతులు
ఒక్క ఆటనూ ఆడలేరు
ఎత్తులు పయ్యెత్తులు పూజ్యం!
పరాజయాల పరంపర నుండి
ఏడుపు ఆవిష్కరించబడి
నవ్వు నియంత్రించబడుతుంది !
దీప నిర్వాణ గంధం ఆస్వాదిస్తూ
మాగాణాలైన వాళ్ళు కళ్ళపాదుల్లో
అన్ని రుగ్మతల పంటాలు
అధిక దిగుబడులు
పచ్చ విప్లవానికి రక్తాక్షర
లిఖిత ఉదాహరణ!
వర్తమానం ఛిద్రమై
ఎప్పుడూ సూర్యాస్తమయాలు మోస్తున్న
నిలువెత్తు మౌనాలు
ఒకింత వేకువకై నినాదాలు మోస్తాయి!
పోరాట మార్గాన్వేషణ మజిలీలో
నగ్నపాదానికి ఉక్కుపాదం తోడై
బ్రతుక్కి కాస్త బాగు అలికించమని
సమైక్య ప్రతిఘటన నాటుతాయి!
గాఢ నిద్రలోంచి వులిక్కిపడి లేచి
అప్రమత్తత తొడుక్కుని నిలబడ్డ వాళ్ళను
నీ చుట్టూ చూసి నిశ్చింతగా నిద్రిస్తావు!
నెత్తురు యింకిన నేలలో
మల్లెల రంగు తెలుపేగాని
ఎరుపు ముందు ఏదోమార్పు దాగి
ఉదయం తూర్పున ఉదయంచనుంది!

# అమ్మ ఎముకతో బొమ్మ*

– తంగిరాల సుబ్బారావు

## 1

అఖండ గౌతమీ తీరంలో
'పెదవాడ పల్లి' గ్రామంలో
క్రీ. శ. 1907 లో
భళ్ళమూడి వారి పసికందుగా
కృష్ణమూర్తి తాత కనుల విందుగా
అమ్మమ్మ లక్ష్మీ నరసమ్మ కలల పసందుగా
ఎన్నో ఎదురు దెబ్బల పిమ్మట 'మాసరమ్మ' వరప్రసాదంగా
అమ్మా! నీ జననం
సీతా మహాలక్ష్మిగా నామకరణం.

తమ్ముళ్ళకూ చెల్లెళ్ళకూ పెద్ద అక్కవు
అల్లారు ముద్దుగా పెరిగిన చక్కని చుక్కవు
కొవ్వూరు మామయ్య, మలకపల్లి పిన్ని, బర్లో మామయ్య,
అబ్బిగాడు మామయ్య, గంగ పిన్ని - అందరూ
నీ యెంగిలి పాలు త్రాగిన తమ్ముళ్ళే చెల్లెళ్ళే.

---

*మా అమ్మ గారు తంగిరాల సీతామహాలక్ష్మిగారు క్రీ. శ. 1907 లో పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు తాలూకా పెదవాడపల్లి గ్రామం లో పుట్టారు. 1990 నవంబరు 26వ తేదీ సోమవారం సాయంత్రం 4-30గం. లకు సికిందరాబాదులో పరమపదించారు. 27తేదీనాడు దహనం జరిగింది. 28 వ తేదీనాడు సంచయనం (ఎత్తిపోత) జరిగింది. దహనం జరిగిన చోటునుండి ఎముకలన్నీ ఎత్తి పారబోసిన తర్వాత, ఆ ప్రదేశంలో ఒక ఎముకతో మా అమ్మగారి బొమ్మ గీయమన్నాడు కర్మ కాండ చేయిస్తున్న బ్రాహ్మడు. 'నువ్వు చిన్నప్పటినుంచీ బొమ్మలు బాగా వేస్తావు కదరా. అమ్మ బొమ్మ నువ్వేగియ్యి' అన్నారు మా అన్నదమ్ములు. నేను ఆ భయంకరమైన పని చేశాను. ఆ అనుభూతితో ఈ కవిత!

## 2

'అష్టవర్షాభవేత్కన్యా' దినాల్లో
ఎనిమిదేళ్ళకే నీ పెళ్ళి పదకొండేళ్ళ నాన్నతో
మీ సంసార సరోవరంలో పదకొండు పద్మాలు మొగ్గతొడిగినా
శతపత్రాలుగా వికసించినవి ఆరు మాత్రమే-
పెద్దక్కయ్య-చెల్లక్క-అన్నయ్య-నేను-బాచితమ్ముడు-బుల్లితమ్ముడు.
చెల్లక్క తర్వాత బుల్లక్క 'సోదు లుండేదన్నావు
బాల్యంలోనే పరమపదించిందన్నావు.
అన్నయ్యకూ నాకూ మధ్య ఇద్దరు చిన్నన్నలు కన్నుమూశారన్నావు.
నీ కడుపులో ఉన్న నన్ను అన్యాయం చేయవద్దని
నాగేంద్రుడికి మ్రొక్కి
నాగుల చీర పుట్టకు చుట్టి
ఆ పుట్టాన్ని భక్తితో నీ పొట్టకు కట్టి
నన్ను కన్నానన్నావు
నాగన్న పేరు నాకు పెట్టానన్నావు.
మీ నాన్న వద్దని తిడుతున్నా జడివానలోనన్ను పసికందును
పొలం తీసికెళ్ళి నా చెవులకు పుట్టమట్టి పెట్టావు
నా మొలకు మందుల పూసలు కట్టావు
అందుకే ముందు నా పేరు 'మందులాడు'!
( ఆ మందుల పూసల మహత్తర బలంతో 60 ఏళ్ళు బ్రతికాను,
ఇంకా బ్రతుకుతాను...)
బుల్లితమ్ముడు తర్వాత మరో చిట్టితమ్ముడు 'జగన్నాథం' ప్రాణహంస
'ఇరగవరం'లో ఎగిరి పోవడం నాకు తెలుసు.
అబ్బిగాడి పెండ్లికి ఎడ్లబండి బోల్తాపడి
నీ కడుపులో ఒక మొగ్గ కమిలి పోవడం నాకు తెలుసు.
నీ ఎనభైనాలుగేళ్ళ జీవిత రూపకంలో
సగం చీకటి సగం వెలుగు
పూర్వార్థం నెత్తుటి వాన
ఉత్తరార్థం వెన్నెల సోన.

మెట్టినింటి ముప్పైయకరాల ఆస్తి
జగ్గన్నతాత క్రోధాగ్నికి హవిస్సు,
పుట్టినింటి మూడెకరాల ఆస్తి
మా ఉజ్జ్వల భవిష్యత్తుకు ఉషస్సు.
'సత్యమేవ జయతే' అశోకుని శిలాశాసనానికి
నీ 'విరాజ్‌బహు' బ్రతుకు ఎగరేసిన విజయపతాకం!

# 3

అమ్మా!
భళ్ళమూడి వారి తళతళల రక్తం నీది
పరుశురామ గణం మీది
దూసిన కృష్ణమూర్తి తాత కట్టి కత్తి వ్యక్తిత్వం నీది
ఉగ్గుపాలతో వంటబట్టిన స్వాభిమానం
పల్లెత్తు మాట పడని మాన సుయోధనం
దేవుణ్ణి కూడా లెక్కపెట్టని ధైర్యం మీ కొలమానం.
'కొవ్వూరు మామయ్య' గండ్రగొడ్డలి వ్రేటు నీ మాట
'బర్లో మామయ్య' పట్టాకత్తి పదును నీ మెదడు
'అబ్బిగాడు మామయ్య' కైజారు కొన నీ ముందు చూపు.

'గంగపిన్ని' గంగిగోవు-
'సుందర మాణిక్యం పిన్ని' వాత్సల్యపు ముద్దమందారం పూవు-
నువ్వు మాత్రం 'టైగర్ టైగర్ బర్నింగ్ బ్రైట్' !

నాన్న
నిత్యం వేదఘోషతో ప్రకాశించే శాంతమూర్తి
చల్లని శరచ్చంద్ర కీర్తి!
నీ సంతానం మేమంతా
పులి కడుపున పుట్టిన లేడి పిల్లలం!
ఏం చెయ్యం?
నీ పోలిక రాలేదు,
మేన మామల పోలికలూ రాలేదు,

అక్కయ్యలిద్దరూ పిన్నమ్మల పోలిక
అన్నదమ్ములం నాన్నపోలిక!

దుశ్శాసన రుధిరంతో వేణీసంహారం కోరే ద్రౌపది
బ్రహ్మనాయుణ్ణి అల్లల్లాడించిన నాయకురాలు నాగమ్మ
పంచకల్యాణి మీద స్వారీ చేసే రుద్రమదేవి
అక్బరు మీద కత్తిదూసిన చాంద్ బీబీ
పౌరుషంతో పాతివ్రత్యంతో
కుతకుత ఉడికి పోయే రసపుత్ర నారీమణులు
బ్రిటిషు వాళ్ళ గుండెల్లో భేరీమ్రోగించిన ఝాన్సీ లక్ష్మీబాయి
పాకిస్తాన్ యుద్ధంలో బంగ్లాదేశ్ సృష్టించిన ఇందిరాగాంధీ-
అమ్మా! నీలో నిత్యం దర్శనమిస్తారు నాకు!

## 4

అమాయకుడైన భర్తతో
చంటీ వెంటా సంతానంతో
అత్త మామల కత్తులబోనులోనుంచి తప్పించుకొని
క్రూర సమాజం ముళ్ళడొంకల్లోంచి దారి కల్పించుకొని
రక్త పాదముద్రలతో తణుకు నగరంలో అడుగుపెట్టావు
మా భవిష్యత్తును కాలదేవతకు ముడుపు కట్టావు
'నవ్వినఊళ్ళేపట్నాలవుతాయి' అని నీధీమా;
'తాళ్ళుకన పడుతున్నాయి, ఊళ్ళుకనపడవా?' అని నీ ఆశ;
అవును, నీది బ్రహ్మవాక్కు!
నీ తిట్టు దీవెన !
నీ కేక మాకు వెలుగురేక!
ఎన్ని పాటలు! ఎన్ని మాటలు!
ఎన్ని నుడికారాలు! ఎన్ని సామెతలు!
ఎన్ని మేలుకొలుపులు! ఎన్ని మంగళ హారతులు!
నువ్వు నడుస్తున్న దేశిసారస్వత విభూతి!
నీ లాంటి అమ్మ న భూతో న భవిష్యతి!!

## 5

అష్టకష్టాలు పడి చెల్లక్క పెళ్ళి చేశావు
మా చదువు సంధ్యలన్నీ శిఖారాలు తాకించావు
అమ్మగా అత్తగా అమ్మమ్మగా నాయనమ్మగా
తాతమ్మగా అవతారాలెత్తి కాలస్వామిని కొలిచావు
మేం నలుగురం నాలుగు దిక్కులు పాలిస్తుంటే
విమానంలో విహరించి చూచి సంతోషించావు
మమ్మల్ని వదలవద్దని అదృష్టాన్ని శాసించావు.
అమ్మా! మాబంగారు బాటకోసం
నువ్వు చేసిన త్యాగ పరంపరల ముందు -
అన్నయ్య ఆలోచన
నా అనురాగం
భాస్కర్రావు భక్తి
బుల్లి తమ్ముడి సేవ
ఏ మూలకి?
మేం నీ యెడల ఎన్నటికీ ఋణగ్రస్తులమే!

## 6

గౌతమీ తీరాన పుట్టిన నీవు
సికిందరాబాద్ కంటోన్మెంట్‌లో కన్నుమూశావు
మిలిటరీ ఆనర్సుతో తుది పయనం చేశావు
అన్నయ్య ఇద్దరు తమ్ముళ్ళూ నీ ప్రక్కనే ఉన్నా
నేను కాయవలిసిన కొమ్ము ఖాళీ!
( అది తెగిన నా దారిద్ర్యాశ్వపుకళ్ళెం
బ్రతికున్నంత కాలం నా ప్రక్కలో బల్లెం!)
మర్నాడు సంచయనం వేళకు నేను హాజరు
సికిందరాబాదు శ్మశానంలో
ఓ పుణ్యాత్ముడు కట్టిన దహన మంటపంలో
భగ భగ మండే నిప్పుల అస్థిపంజరంగా

మౌనంగా గడ్డకట్టిన మా యేడుపులా
బూడిదలో నీ మృత్యుశిల్పం!
భయంకర అంగారతల్పం!!

నా ఆత్మకు అందమైన ఈ గూడు కట్టి యిచ్చిన మాఅమ్మ
నా రక్త మాంసాలు పెంచి పోషించిన మా అమ్మ
శైశవ దశలో నా మూత్ర పురీషాదులు తన గాత్రంలో ఇంకించుకున్న
మా అమ్మ
నా సుఖసంతోషాలు తన సుఖసంతోషాలుగా పరవశించిన మా అమ్మ
నా కష్టనష్టాలకు కన్నీరుగా కరిగిపోయిన మా అమ్మ
నెమలి కంఠం రంగు చీర కట్టుకొని నెమలిలాగే ఠీవిగా నడిచే మా అమ్మ
కంచి పట్టుచీరతో శుభకార్యాలు గరగర చేసిన మా అమ్మ
కార్తీక మాసం చలిప్రొద్దుల్లో గోస్తనీనదిలో అరటిదొప్పల దీపాలు
వదిలిన మా అమ్మ
పూజలు చేసిన మా అమ్మ
పాటలు పాడిన మా అమ్మ
పుట్టింటిమాటంటే చివరి దాకా చెవికోసుకునే మా అమ్మ
'హోద్దెబ్బా!' అంటూ బంధుకోటిని ఆనందంగా ఆహ్వానించే మా అమ్మ
'మిమ్మల్ని కన్నాను కాని మీ రాతను కన్నానా!' అనే వేదాంతి మా అమ్మ
ఈ సుందరలోకాన్ని నాకు ప్రసాదించిన మా బంగారు అమ్మ-
ఇప్పుడు
ఈ నగరం చితిలో
ఇంకా కాలుతున్న ఎముకల గూడుగా
'ఇంత జీవితం ఇంతేసుమా!' అనే వైరాగ్యపు గోడుగా
నిరాశగా - నిస్సారంగా - నిస్సహాయంగా
చప్పగా - ఉప్పగా
ఏడుపుగా - గాడుపుగా
ఆకలిగా - దూకలిగా
కటికి చీకటిగా - కాలిన గడ్డిమేటిగా
కుములుతున్న కుమ్మరావంగా
మొదలు నరికిన పచ్చని చెట్టుగా

మండు వేసవిలో ఎండలు క్రక్కే రాళ్ళగుట్టగా
తిలాదానం పట్టే నల్ల బ్రాహ్మడి దరిద్ర ముఖం మీది బొప్పిగా
తెగిన చెప్పుగా
పాత పీటగా
కుక్కి మంచంగా
తుప్పుపట్టిన మేకుగా
బొట్టు బొట్టుగా ఏడుస్తున్న ధారాపాత్ర కన్నీరుగా
మొలుస్తున్న నవధాన్యాల అదృశ్య మౌన చైతన్యంగా
మునిమనుమల మనుమరాండ్ర ఆటపాటలుగా
ఓదారుస్తున్న ఒంటరి దీపంగా
గోదానం కోసం తెచ్చిన ఆవు డొక్కలో ఆకలిగా
మా అన్నగమ్ముల బోడిగుండ్లుగా
నెత్తిమీది వికృతమైన పిలకలుగా
నీరుకావి దీక్షావస్త్రాలుగా
కాలువ గట్టుకు మోసుకు వెడుతున్న పిడకలుగా
గాలికి చిరిగిపోతున్న మృదువైన అరిటాకుగా
బియ్యంగా పెసర పప్పుగా
అల్లంగా బెల్లంగా
నడిరోడ్డులో ఉడుకుతున్న అన్నంగా
కాకులు తింటున్న పిండాలుగా
నదిలోకి విసిరివేస్తున్న అస్థికగా
బూడిదగా - శూన్యంగా
శ్మశానంలో
మా
అమ్మ!!!

## 7

''ఒక ఎముక తియ్యండి!''
అపరకర్మ బ్రాహ్మడి అరుపు-
అమ్మ ఎముక పట్టుకున్నాను

ఏదో చెప్పరాని భయంతో
గజగజ వణికి పోతున్నాను...
''కన్నా! భయపడకు! ఇది నీకు
అన్నంపెట్టిన కుడిచేతి ఎముక!''
నా అంతరాత్మను అమ్మ ఓదారుస్తోంది!
''ఎముకలన్నీ ఎత్తండి!
జాగ్రత్త! గుచ్చుకుంటాయి!''
బ్రాహ్మడి మరో అరుపు-
నాకు చనుబాలిచ్చి పెంచిన అమ్మ ఎముకలు
నా మలమూత్రాలు ఎత్తిపోసిన అమ్మ ఎముకలు
నన్ను ఒడిలో కూర్చోబెట్టుకొని
''తారంగం! తారంగం! తాండవకృష్ణా తారంగం!''
నేర్పిన అమ్మ ఎముకలు
''విద్దెం! విద్దెం! వరహాల విద్దెం''చేయించిన అమ్మ ఎముకలు
''కాళ్ళాగజ్జి! కంకాళమ్మ! వేగులచుక్క! వెలగామొగ్గ''
ఆడించిన అమ్మ ఎముకలు
'' ఏనుగమ్మా! ఏనుగు! ఏవూరొచ్చింది ఏనుగు!''
పాడించిన అమ్మ ఎముకలు
నన్ను అల్లారు ముద్దుగా పెంచిన అమ్మ ఎముకలు
నాకు గుచ్చుకుంటాయా? పిచ్చివాడా!

''చితిపెట్టిన స్థలంలో ఆ ఎముకతో
మీ అమ్మగారి బొమ్మ గీయండి!''

తన బంగారు బొజ్జలో
నా బొమ్మ గీసింది మా అమ్మ!
ఇప్పుడు-
నేను-
మా అమ్మ బొమ్మ గీయాలంటే
కవి మిత్రుడు 'ఎన్. గోపి' ఎప్పుడో చెప్పినట్టు
అమ్మకు అమ్మనై పుట్టాలి కదా మరి!!

31-12-1990

# మనసు ఆకలి

(కవితలు)

'యశశ్రీ'

(యెనిశెట్టి శ్రీ రంగనాయకి)

చైతన్య కవిత

భావ వసంతం

SPRING 1994

# మనసు ఆకలి

ఒంటరితనమనే కీచురాయి
మెదడులో రొదపెడుతుంటే,
హృదయం నీ వియోగమనే చెప్పుక్రింద
ఎండుటాకులా మారి ముక్కలౌతుంటే,
ప్రమాణాల ఇసుక గూళ్ళు
    నీవు రాలేదనే
భావ వీచికలకే కూలిపోబోతుంటే- - - -
    సరిగ్గా
    అప్పుడొచ్చావు!
పసివాని బుగ్గన కాటుకచుక్కలావున్న
నీ కంటిపాపలో వెదికాను నా రూపం,
నా కంటి చూపుడు వేలుతో
నీ హృదయంలో నా రూపం వుందని చూపి,
    ఆశాభంగం చెంది
నీ శరీరమనే నిలువెత్తు అందమైన అద్దంలో
    అణువణువూ వెదకి,
నా ప్రతిబింబమెక్కడా కానరాక
    కలవరపడి
    కన్నీరు మున్నీరై పొంగి,
రెప్పల కట్టలు తెంచే సమయంలో-
    అల్లరిగా నువ్వు
పెదవుల అమ్ముల పొదినుండి
చిరునవ్వుల బాణాలు వదిలావు
    అంతే-
ఏదో అవ్యక్తానురాగంతో
నా పెదవులు ముద్దుల పూలబొఖేలయ్యాయి!
మండే గుండె, జేగంటై నీ పేరే మ్రోగించింది!

తనువు చెంగలువయ్యై
నీ ప్రేమ సెలయేట తడిసింది!
మనసు ఆకలి
నీ మమతానురాగాల అమృతంతో తీరింది!!

20-1-94.

## కన్నీటి కానుక

జీవితపు బ్రహ్మజెముడు డొంకలో
సంపెంగ సౌరభంలా ప్రవేశించావు.
అంబరాన అందాల హరివిల్లును త్రుంచి
అధరంపై కొంత, అరచేతిలో కొంత
అందంగా అద్దావు.
నిన్నటివరకూ
అల్లరి పొగమంచు తెరలవెనుక నిలబడి
నాతో దాగుడుమూతలాడిన నీ రూపం
ఇప్పుడు
'బాహుబలి' విగ్రహంలా
కళ్ళెత్తినా కనిపించనంత ఎదిగింది.
అలాచేసి
ఆటలాడిస్తున్నా నిన్నంటూ
ఆనందిస్తున్నావేమో?
నేను మాత్రం,
నా కంటి పాపలకు
రెప్పల దుప్పటి కప్పి,
మనోనేత్రంతో

మహామనీషివైన నిన్ను
అనుక్షణం వీక్షిస్తూనే వున్నాను;
చెమ్మగిల్లిన నా కన్నుల
చప్పుడు వింటూనే
కన్నీటి కోనేటి కలువలను
    నీ కాళ్ళముందు
    క్రొత్త దండలా
కూరుస్తూనే వున్నాను!!

**14-12-93.**

## అహల్య

నా
గుండె
గాలిపటమై
గాలిలో గంతులేస్తున్నప్పుడు
            తెలియదు-
నీ చూపుల కరంట్ తీగల్లో
    చిక్కుకుంటుందని.
పారాచూట్‌లా తనువు
నీ స్పర్శలో తేలుతున్నప్పుడు
            తెలియదు-
నీ జ్ఞాపకాల సుడిగాలికే
నేలవాలిపోతుందని.
పూర్వజన్మలో ఎప్పుడో
'మోనోజెనిసిస్' సిద్ధాంతమేదో
        మళ్ళీ
మనల్ని కలిపిందని తలచి,

తెగ(తుళ్ళి)
కంటికెమేరాలో నిన్ను బంధించినప్పుడు
తెలియదు-

నా ఆశల అల
నీ విరహమనే వజ్రపుగట్టుపై
ప-గు-లు-తుం-ద-ని.
తెలిసుంటే-
మమత లేని మానుగానో,
మనసు లేని మరబొమ్మగానో,
పారవశ్యమే లేని పాషాణంగానో,
అనుభూతిలేక పడివున్న అహల్యగానో
మిగిలిపోయేదాన్ని!
అదే
మహదానందమని మురిసిపోయేదాన్ని!!

13-1-94.

## పరాజిత

నువ్వొస్తావని
ఎఱ్ఱ నారింజలాంటి
సూర్యుడనే పండును
పడమటి కొండ మింగేదాకా...
అమావాస్యను వెలుగు చాపలో చుట్టేసి
పూర్ణిమ పలకరించే పిలుపు వరకూ...
శిశిరపు చివికి చీరెను వదలి
ప్రకృతి కన్య
వసంతాన్ని వళ్ళంతా చుట్టేదాకా...
చూసి...చూసి
కనుపాపలు అలసిన గుజ్జాల్లో
ఆగి ఆగి కదులుతున్నాయి.

నీవు రాక పోవడంతో
నూరేళ్ళ బ్రతుకు
నిరాశ జారుడుబండపైనుంచి
పాదరసంలా జారిపోతోంది.
ఇప్పటికీ నీవు రాకపోవడంతో
నీ విరహాగ్నికే దహించుకుపోయే
'ఖాండవవనం' లా మారాను.
నీ తోడుతో
'ద్విపద' లా వెంటవెంటనడవాలని,
'తేటగీతి' లా తియ్యగా బ్రతకాలని,
కలలు కనీ...కనీ,
ఎప్పటికీ నీవు రావనే
జ్ఞానదంతం ఇప్పటికి వచ్చాక,
నీ తలపులతో నిండిన
మనసు తలుపులు మూసి,
మరపు గొళ్ళెం వేశాను.
ఇంత జరిగాక-
నన్ను
నీవు వరించకపోయినా,
'ఊర్మిళాదేవి' నిద్రయినా వరించదేం?!

2-12-93.

## ఆత్మ నీరాజనం

మౌనం తప్ప మాటలు మరచిన నాకు
చక్కెర చతురోక్తులు నేర్పి,
మంత్రాలు నా మాటలంటూ
పంజరంలో చిలుక వంటి

జీవితానికి స్వస్తి చెప్పించి,

తిరిగి

పచ్చదనాన్ని పంచి,

పంచవన్నెల రామచిలుకలా మార్చి,

వినీలాకాశంలో విహరింపజేశావు.

ఆ అనుభూతిని

గుండె గదిలో బంధించుకున్నాను.

లోకం నవ్వులను బ్రతుకు ముంగిట్లో

పువ్వులుగా మార్చిన నీకు

నన్ను నేనే నీరాజనమివ్వడం తప్ప

ఇంకేమివ్వను? 26-11-93.

## వలపు పాట

నీవు 'ఊc' అంటే-

బ్రతుకు పుస్తకంలో పుటలా ఉండాలని;

గుండె గుడిలో దివ్వెలా వెలగాలని;

నడిచే దారిలో మెట్టుగా మారాలని;

చేతి గోరింటనై పండాలని;

శరీరపు వత్తికి నిప్పుపుల్లనవ్వాలని;

ఆత్మకు నీడలా నిలవాలని

కాదంటే

నేనౌతా ఇసుకబొమ్మలా! 26-11-93.

# ఎదురు తెన్నులు

నా జీవన తనూలతకు
వసంతాన్ని తెచ్చిన కోయిలవు.
వలస పోతుందే
వద్దనలేనుగాని నేస్తం!
శిశిరమనే కన్నెగా మారి,
చీకటి బురఖావేసుకొని,
రోజులను ఋతువులుగా లెక్కిస్తాను-
నీ పునరాగమనానికై!! 16-1-93.

# నిరుద్యోగి

బ్రతుకు వైకుంతపాళి ఆటలో
పెద్ద పాముకు మాత్రమే ప్రియమైనవాడు. 27-12-93.

# గాయం

చిన్నప్పుడు
ఉయ్యాల్లోంచి పడ్డాను-
తలపగల్లేదు
ఉక్కుపిండమన్నారు!
ఇప్పుడు-
నీ ప్రేమ ఉయ్యాల్లోంచి పడ్డాను-
గండె పగిలింది!
పిచ్చిదాన్నన్నారు
అందరూ!! 8-11-93.

## వ్యత్యాసం

అమ్మ
ప్రేమతో పెంచింది,
పాలమీగడల్లో ముంచింది.
ప్రియా!
నీవు
ప్రేమను త్రుంచావు,
జిన్ను రమ్ముల్లో ముంచావు! 8-11-93.

## మార్పు

మునుపొక వానప్రస్థాన్ని
నేడొక పరిమళ పుష్పాన్ని. 8-11-93.

## భామాకలాపం

నీ కంటి చూపులో
కాలుతాననే భయంకన్నా
నీ వాలుజడ కొరడాదెబ్బలే
కొంతనయం. 9-10-93.

## నిలువుటద్దం

నేనెలా ఉన్నాను అనగానే
అమ్మచెప్పే అందమైన అబద్ధంకన్నా,
నిలదీసి నిజంచెప్పే అద్దంమిన్న. 9-10-93.

## కొవ్వొత్తి

నన్ను కాల్చేవారికి వెలుగునిస్తాను,
కౌగిలించుకొనే వాటిని మసిచేస్తాను. 9-10-93.

## కాలసేవ

'కీ' ఇవ్వకనే
తూర్పును మేల్కొలిపే
అలారం 'కోడిపుంజు'.
వసంతం పొడచూపగానే
రాగంతీసే రేడియో 'కోయిల'.
ఆకాశం జీతభత్తెం ఇవ్వకనే
కాపలా కాసే గూర్ఖా 'చంద్రుడు'. 9-10-93.

## నిరీక్షణ

విత్తనం భూమి గుండెలో
దాగుంటుంది, మొలకెత్తేదాకా.
చందమామ మబ్బుదుప్పట్లో
మకాంపెడతాడు, చుక్కలు పిలిచేదాకా.
నేను నీ బాహువుల్లో నిద్రపోతా,
ఆత్మకు పిలుపువచ్చేదాకా! 9-10-93.

## సూర్యచంద్రులు

ఆకాశమనే బాలుని ఆటకై
పరమాత్మ సృష్టించిన
బంగరు గోళీలు! 9-10-93.

# ఆ...డ పిల్ల

ఎగిరే పిట్టలాంటి బాల్యాన్ని
పెద్దరికపు పంజరంలో బంధించి,
అమ్మా నాన్నల ఆజ్ఞలతో
అల్లరిని అటకెక్కించి,
నవ్వుల ఇంద్రధనస్సులను
పంటి ప్రిజమ్ వెనుక పట్టివుంచి,
ఆస్తిపాస్తుల కావళ్ళతో పాటు
అనుభూతుల అణాలను
కొంగున తాయిలంగా కట్టి,
కన్నీటి తోరణాలను
కన్నవారి వాకిలికి వదలి
అత్తారింట బ్రతుకు అక్షరాభ్యాసం మొదలెట్టింది.
వచ్చింది మొదలు
ఆ ఇంటి విశాలాకాశానికి
వేగుచుక్కలా మారింది.
పండక్కీ, పబ్బానికీ
వారు కోరే కోర్కెల తీగపై
పడకుండా నడిచే గారడీ నేర్చుకోలేక
సహనం చచ్చి
ఆవేశం అత్తగారి గొంతవ్వబోతే...
పరువుచేతులు పట్టుబట్టలా
పెదవులు మూసేవి.
చాకిరి నిప్పుల గుండంలో
కాలే కట్టెగా మారి
అలసిన ముఖాన్ని
పలకరింపనే అద్దంలో చూచుకోబోతే
ప్రతిబింబం మసిబారి
విసుగు ముఖాలు
పల్లేరు కాయల్లా
గుండెలో గుచ్చుకునేవి.

అయినా
వారి ఇంటికొమ్మను వదలక
వేలాడే పిచ్చుకగూడయ్యింది.
వీధి దీపాలు వెలుగు చీరెను
చుట్టుకునే వేళకు
వంగిన నడుం విరామంకోరి
దొడ్లో గోడను పడక కుర్చీగా చేసుకుంటే
ఆ ఇంటి రేడియోలోంచి
రోజూ రాగం మారని
వ్యధల పాటవిని విసుగెత్తి
కొబ్బరాకుల తలుపులు తెరచి
వెన్నెల కిరణాలు పిల్లలై పరుగెత్తి
పాట మార్చమని మారాంచేస్తూ
చుట్టుముట్టేవి.
చల్లని చిరుగాలి చెంగు
చెమట తుడిచేది.
ఈ అన్యాయం ఏమిటని
ఏనాడూ ప్రశ్నించని
ఆమె ముఖం కాన్వాస్‌పై
ఇప్పుడు
అమ్మతనం కుంచె
ఆనంద రంగవల్లుల్ని అద్దుతోంది.
ముఖం గూటిలో
కళ్ళు
తెల్లజంటపావురాళ్ళై మెరుస్తున్నాయి
అప్పుడప్పుడు

చేతులు స్టైతస్కోపులై
పొట్టనే ఘృత భాండంలో పవళించి
మాసందాటితే వస్తానని చెప్పే
మరో 'సుపర్ణుడి'
మౌన భాషను వింటున్నాయి.
ఇన్నేళ్ళకు
మెదడు దంతం భరిణిలో
భద్రంగా దాచిన భావాలు
దూదిపింజలై ఎగురుతున్నాయి!

23-2-94.

---

'' వెన్నెల త్రాగితే గానీ
వేణువులు ఏడుస్తున్న సాయంకాలాల్ని
భరించలేను.
మనిషి చెప్పలేని వేదన
వేణువు అనుభవిస్తుంది.
మాట ఈదలేని లోతుల్లో
ముంచి వేయబడిన ఓడ
మనిషి..........''

–శేషేంద్ర

# అభినందన హారిచందనము

-కలుగోట్ల విజయాత్రేయ.

మల్లంపల్లి మహామనీషి కవితా మార్ద్వీక ధారా ఝరీ
సోల్లాసక్రియ చౌకళించె - విజయస్ఫూర్తిన్ తెలుంగున్ కళా
భిల్లా కోమల కావ్యకేతన రుచుల్ క్రేళుల్ పిసాళించి యు
త్ఫుల్లాంభోజపరిమళ ప్రభల పెంపుల్ సొంపు లింపారగన్.

వాణీ కంకణ నిక్వణ క్వణలు- శర్వాణీ పదాబ్జాల్ ఝుం
ఝూణం ఝూణ విలోల నూపుర రసస్ఫారస్య సంపత్తి ధం
ధాణం ధాణ విరాజి భర్గ డమరు ధ్వానమ్ము గోపాల క
ల్యాణ స్పందిత కింకిణీ రవళి - మల్లంపల్లి వాగ్జృంభణల్.

జిలిబిలి తెల్గుపల్కుబడి చిందులు ద్రొక్కగ జుంటితేనె క్రొం
దొలుకులు - భావకల్పనల తూగిసలాడగ నవ్య శిల్ప సం
చలనము - రీతి శయ్యలు రసమ్ములు చిమ్మగ కావ్య సౌరభం
బలదిన ధీరకీర్తి శరభయ్యకు వందనముల్ కళాంజలుల్.

శారదా కచ్ఛపీ తంత్రికా రసార్ద్ర
మంద్ర గంభీర నాద ప్రమాణములను
భవ్య శరభయ్య కావ్య సంభావ్యత లవి
తెలుగు సాహిత్యవీధి చిందించి మించె.

దివ్య సాహిత్య దీప్తు లుద్దీప్త నవ్య
భవ్య కవితా ప్రదీప్తులు భావుక మణి
మధుప మృదుల మల్లంపల్లి మాన్యమూర్తి
చరణ కమలములకు నమస్కార శతము.

గగన గంగా ఝురీ గమనవేగోద్ధాత
చాప ధారా రసస్ఫార గరిమ
ధీర గోదావరీ వీర వీచిస్నిగ్ధ
గంభీర కల్యాణ గమన భంగి

తరళ కృష్ణానదీ తారంగ సారంగ
సంరంభ సౌందర్య సౌరభమ్ము
కమనీయ యామునా రమణీయ లహరికా
రాధికా మాధూక రాగపటిమ

మురిపె మెగ్రబాక సొగసుగా మోహరించి
తెనుగు దనమున గీర్వాణ ఘనతలోన
ధాటిగా నిలచిన మేటి విద్వత్కవీంద్ర
మూర్తి కీర్తికి విజయు కైమోడ్పులివియె.

❁ ❁ ❁ ❁ ❁

---

## జీవితం

మీ వ్యాకరణం ఎట్లా వుంటేనేం
ఈ వాక్యంలో
క్రియే ముఖ్యం నాకు!

- కె. యస్. రమణ

❁ ❁ ❁ ❁ ❁

## తాజ్‌మహల్

ప్రేమ
ఎక్కడ పుట్టిందో కాని
ఇక్కడ సమాధైనా
ఇంకా బ్రతుకుతూనే ఉంది.

- ఆసు రాజేంద్ర

కవి శేఖర

## శ్రీ తెన్నేటి కోదండరామయ్యగారి సన్మాన సందర్భమున

దేవరకొండ బాలగంగాధరతిలక్ సమర్పించు

# కవితా సుమాంజలి.

తణుకు సంస్కృతి జీవన వనధిలోన
మొదట నుదితమైన శశాంకమూర్తి వీవు!
త్వన్మనోహర చంద్రికా ధౌత వియ ద
నంత విస్ఫుర దుడుగణమ్మగుదుమేము.

కిల కిల మంచు నవ్వులొలికించెడి నీదగు పల్కు మీగడల్
వలనుగ రెండు చేతులను పట్టి భుజింపనివాడు, తద్గతో
జ్వలిత చమక్ చమత్కృతికి సైయని పల్కనివాడు, గోస్తనీ
జలముల త్రాగనట్టి నరజన్ముడు లేడిట చుట్టు ప్రక్కలన్.

నీనాపూర్వుల రక్త బాంధవ దృఢోన్నిద్రైక కౌటుంబికా
జ్ఞాన స్నేహము నేడు నవ్య కలనా సారస్వతోపాసనా
ప్రాణమ్మై మరియింత చిక్కవడె ; భాస్వద్భావ బంధూ చల
ద్వాణీ నూపుర నాదరమ్య పదవీ ప్రాగల్భ్య వాఙ్మంత్రికా!

సరస హాస్యరీతి సత్కళాభి నిరతి
మేలి గ్రంథ రచన - మీదుసొమ్ము!
వయసు చూడ ముసలి వగ్గ వౌదువుగాని,
పడుచు దనవు పొగరు భావమందు.

అందమ్ముల్ మన జాతి చందములు, సంఘాభ్యున్నతుల్ మూఢ లో
కాందోళాస్పద హేతు వాదములు, సమ్యగ్జీవ నానందముల్
చిందు న్నీ కలమైన పల్కయిన గానీ: సత్కవి శ్రేష్ఠ! యీ
వందారుంగవి భక్తి మాల్యగొనుమా! వాత్సల్య సంపూర్ణతన్!

తణుకు — బాలగంగాధరతిలక్
శార్వరి చైత్రం 24-4-1960

# గోపికా గీతలు

## తంగేడు పూలు(1976)

కత్తికీ మిత్తికీ
కలహం రావాలి
కత్తి కొత్త సిద్ధాంతాన్ని వెలిగించే
వత్తిగా మారాలి.

❁ ❁ ❁ ❁ ❁

రెప్పల చాటున పడుకున్న
నిప్పును లేపకండి
తలలెత్తే ఆగ్రహానికి
తలుపులు తీయకండి.

❁ ❁ ❁ ❁ ❁

కేకలు నిశ్శబ్దంలోకి జారవు
గుండె నుండి గుండెకు
యుగాంతం దాకా ప్రతిధ్వనిస్తాయి.

❁ ❁ ❁ ❁ ❁

గుంపు నుండి విడి పోకు
కోపాన్ని ప్రదర్శించలేని వాడు
లోకాన్ని మార్చలేడు.

❁ ❁ ❁ ❁ ❁

## మైలు రాయి (1982)

సాయంత్రం
హుసేను సాగర్ జలమైదానంలో
సూర్యుడు
ఎఱ్ఱద్దకం చీరలు ఆరేస్తుంటాడు.

❁ ❁ ❁ ❁ ❁

తడి సిమెంటు నవ్వులతో
బ్రతుకుల నతకాలి
ఆగ్రహం అనుగ్రహం వంటిది
నిర్మించే వాడికే చెల్లుతుంది
నిప్పైనా ; నీరైనా;

❀ ❀ ❀ ❀ ❀

## దారి

ఓడ కింద
నీళ్ళేమను కుంటున్నాయో
ఓడకు తెలుసా?
వాటి గుండెలు చీలితేనే
దానికి గమ్యం !

❀ ❀ ❀ ❀ ❀

## చిత్రదీపాలు (1989)

ప్రయాణమంటే అందుకే నాకాశ !
కిటికీల్లోంచి కవిత్వం వీస్తుంది.
పొలిమేర దాటగానే
కలలు మేలుకుంటాయి.
ముందుకి వెళ్తున్న కొద్దీ
మనస్సు వెనక్కి పరుగెడుతుంది.

❀ ❀ ❀ ❀ ❀

అవిశ్రాంత సంధ్యలో
ఆరని గుండె అగ్నిగుండమవుతుంది.

❀ ❀ ❀ ❀ ❀

కళ్ళచిప్పల్లో కాగినందుకే అది ముత్యం
బుగ్గల కొండమీద చారలైనందుకే అది వర్షం
వెదురు బిలంలో గాయపడిన గాలి గుచ్చుకొని
ముళ్ళుకూడా చిగురిస్తాయి.

❀ ❀ ❀ ❀ ❀

ఎన్ని బొమ్మలు కట్టినా
ఎంత దూరం లాగినా
నా వ్రేళ్ళలో దూరిన
నీ కరస్పర్శే కవిత్వం.

❀ ❀ ❀ ❀ ❀

ఎవరు నాటారో ఈ మొక్క
వారికి నా దండం!
ఎవరి నవ్వో ఈ పువ్వు
అది నా హృదయం!

❀ ❀ ❀ ❀ ❀

కవిత్వం చేత ధరించి
సముద్రం ముందు నిలుచుంటాను.
కల్లోల భేరీలు మ్రోగుతాయి.

❀ ❀ ❀ ❀ ❀

మిట్టెండలో కట్టెల మోపు లెత్తు కొని
మైళ్ళ దూరం వెళ్ళే కాళ్ళు
నా గుండె మీంచి నడుస్తాయి.

❀ ❀ ❀ ❀ ❀

ఉపమానాల కొయ్యలకు తగిలించిన
మాసిన దుస్తులు కవితలు.
ఎగసిన అగ్నికణాలు బూడిదయినట్టు
అనుభవాలను వ్యక్తం చేసే పెనుగులాటలో
ఓడిపోయిన రక్తంగుర్తులు కవితలు.
మట్టికి దూరమైనవేళ్ళు
ఆకాశాన్ని పిలుస్తాయి
జీవితాన్ని కోల్పోయిన స్వప్నాలు
శూన్యంలో తూనీగల్లా ఎగురుతాయి.

❀ ❀ ❀ ❀ ❀

వ్రేళ్ళ సందుల్లోంచి కారిపోయే
అహంకారం కవిత్వం!
కళ్ళ కొండల్లోంచి దూకి పారే
నిస్సహాయత కవిత్వం!

❋ ❋ ❋ ❋ ❋

అందరూ హాయిగా ఉండేదాకా
ఈ అశాంతి కొనసాగుతుంది.

## వంతెన (1993)

పట్టణం ప్రియురాలు కూడా కాదు
పల్లెల్లో తల్లి వొడి కరువైంది
రెంటికీ చెడిన ఒంటరి మోడులా నేను..

❋ ❋ ❋ ❋ ❋

ఈ నాడు యుద్ధమొక వార్త కాదు
వాస్తవం!
యుద్ధమొక చావు కాదు
నరజాతి విధ్వంసక రిరంస
ఎవడిది గెలుపో ఎవడిది ఓటమో
గడ్డిపూల ప్రక్కన కూలబడ్డ సైనికుడు మాత్రమే చెప్తాడు.

❋ ❋ ❋ ❋ ❋

లాభం లేదు
రెండు వెలుగు తీరాల మధ్య
ఘనీభవించిన చీకటిని పరపరా కోసేసి
ప్రభాత రక్తాన్ని పులుముకోక తప్పదు.

❋ ❋ ❋ ❋ ❋

సూర్యుడు పురోగామి
అస్త మించడానికైనా సిద్ధమే కాని
వెనుకంజ వేయడు
తూర్పున దానిమ్మ
గుప్పెడు మాణిక్యాలతో బ్రద్దలవుతుంది.

❋ ❋ ❋ ❋ ❋

ఇవాళ
జీవితం, మరణం పర్యాయ పదాలయ్యాయి.
ఇవాళ కవిత్వం
గుండెలమీద లాలించే పసి పాప కాదు.
ఈ నాడు కవిత్వం
ముసలి యోధుని కుంపటిని ఊదే ఊపిరికాదు.
వాస్తవాల్లో పునీతంకాని అక్షరాలు
చీకట్లో దీపాలు వెలిగించవు.

❋ ❋ ❋ ❋ ❋

ప్రక్కన ఉండి చూస్తే నది ఒట్టి నీళ్ళే.
కాస్త పైనుండి చూడు
చరిత్ర మలుపు తిరుగుతుంది.

❋ ❋ ❋ ❋ ❋

పువ్వుల్ని ప్రేమించే వాడెప్పుడూ
నవ్వుల్ని చంప లేడు.
చచ్చిపోయిన వారి గురించి
సమాధులు మాట్లాడు కుంటాయి.

❋ ❋ ❋ ❋ ❋

ఇంటి ముందు నెత్తుటి గుడ్డలా న్యూస్ పేపర్
వొణుకుతున్న చేతుల్తో పట్టు కొని బావురు మన్నాను.

❋ ❋ ❋ ❋ ❋

నే నెప్పటికైనా రాయాల్సిన వాక్యం
గుండెల్లో నాదమై, కళ్ళల్లో వెలుగై
అణువణువూ ప్రాణమై
పరిమళించవలసే వుంది.

**(డా. ఎన్. గోపి కావ్యాల నుండి సేకరణ : తంగిరాల)**

# A Letter to President Mandela

Gyan Bagh Palace
Goshamahal. Hyderabgad A.P.
INDIA
22 MAY 1994

To
H. E. The President
of South Africa Mr. Nelson Mandela
Capetown
South Africa

Dear Mr. President,

The Epic happenings of South Africa have left the entire world dazed. An Injustice of great proportion has seen its downfall. Truth ultimately triumphs and you the people of that continent have borne the cross of humiliation and suffering with great fortitude like no other country has. Rightly you and your people richly deserve this Victory, and in your victory the suffering mankind finds solace.

Sir, I am moved by the great historic event in your country which is very relevent to the entire world of discrimination. For the down trodden suppressed human beings the world over, Africa's freedom is a lofty hope. In this mood I wrote a poem, a humble token of my admiration for you as a great leader of your people. I have dedicated my poem to you entitled 'Dawn in a Continent'. It has already been printed in our regional language magazines of which this is a translation. I request you to accept this dedication.

Wishing you every success in your future endeavours

Yours Sincerely

sd/-

(Seshendra Sharma)

# DAWN IN A CONTINENT

Come my people come, to gorge at the banquet of my words,
Each cell in my body explodes into millions of iridescent constellations and stars, dancing with joy all round the sky;

My body, just a seed that it is,
Blows off into fantastic green trees full of flowers, of exotic colours,
Floating like drunkards, like titanic balloons into the incredulous heights of the empyrean;
The humanity in me turning into the silvery orb of the full moon ascends the top of my house and scatteres tempests of moonlight into universal joy;

Today is a day unparalleled in the history of mankind, that I rose up aloft from the bay of my depression
Aloft like a flag due to you-

What a marvellous achievement
You demolished the mildewed apartheid, the slavery imposed on the black man for centuries three in number,
And gifted him the gold of the invaluable breath of freedom,

Yes you have established the spirit of the great leaders of people that visited the earth before you-
You roared in your pristine voice that all men are equal;

' The Bird more than Man has the right over the garden for trees are their dwelling places' You said.
At last you have ushered in an event of epic immensity;

Now, dawn flows like a gurgling brooke
My breath turns into monsoons and wafts like frolicking breeze carrying the string of pearls of my joyous tears to embrace your neck,

And I, turning into our Ganges run to adorn your shoulders fit to bear a country's magnificent burdens,

Mandela you have changed the course of Man's journey.

- SESHENDRA SHARMA

****************************************************

"Fear is poetry, hope is poetry, love is poetry, hatred is poetry; contempt, jealousy, remorse, admiration, wonder, pity, despair or madness are all poetry. Poetry is that fine particle within us that expands, rarefies, refines, and raises our whole being. Without it man's life is poor as beast's. Man is a poetical animal."

- William Hazlitt,

# కవితా విలాసం

1. **'పఠాభి'**
టి. పట్టాభిరామిరెడ్డి,
23 (ఓల్డ్ నెం. 58), సెయింట్‌మార్క్స్ రోడ్,
బెంగుళూరు - 560 001.

2. ఎన్. గోపి
ప్లాట్ నెం. 12, ఇం.నెం. 13-1/5బి,
శ్రీనివాసపురం, రామంతపూర్,
హైదరాబాదు - 500 013.

3. **మారుతీ శ్రీలత,**
309, 1వ స్టేజి, 2వ ఫేజ్,
2 వ క్రాస్, గోకుల,
బెంగుళూరు - 560 054.

4. **పెన్నా శివరామకృష్ణ,**
10-84/1, బాహర్ పేట,
పర్గి పోస్టు - 501 501.
రంగారెడ్డి జిల్లా.

5. **దివాకర్ల రాజేశ్వరి,**
198, సెకండ్ మెయిన్,
మహలక్ష్మి లేఅవుట్,
బెంగుళూరు - 560 086.

6. **సాదనాల వేంకటస్వామి నాయుడు,**
29-1-28/1, దేవీ చౌక్,
రాజమండ్రి - 533 104.
తూర్పుగోదావరి జిల్లా.

7. 'భగ్వాన్',
ఎ.పి.యస్.భగవాన్,
లంకల కోడేరు - 534 250,
పాలకొల్లు మండలం,
పశ్చిమ గోదవరి జిల్లా.

8. బి.హెచ్.అమర్‌నాథ్,
c/o ఎ. రామచంద్రరావు,
రత్నం పేట,
రామచంద్రపురం - 533 255,
తూర్పుగోదావరి జిల్లా.

9. అడిగోపుల వెంకటరత్నం,
అసిస్టెంట్ ఇంజనీరు,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్ - 522 510,
గుంటూరు జిల్లా.

10. 'యశశ్రీ'
యెనిశెట్టి శ్రీరంగనాయకి,
d/o వై.సాంబశివరావు,
10-323/బి. ,
మార్కాపురం - 523 316,
ప్రకాశం జిల్లా.

11. కలుగోట్ల విజయాత్రేయ,
గని - 518 010,
కర్నూలు జిల్లా.

12. **GUNTURU SESHENDRA SARMA,**
Gayan Bagh Palace,
Goshamahal,
Hyderabad - 500 012, A.P.

## చైతన్య కవితా వేదిక

**బెంగుళూరు.**

| | | |
|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | శ్రీ టి. పట్టాభిరామిరెడ్డి (పఠాభి) |
| అధ్యక్షులు | : | శ్రీ డి.కె. ఆదికేశవులు |
| ఉపాధ్యక్షులు | : | శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఎ.యస్.<br>శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి<br>శ్రీ కె.పిరావు<br>శ్రీ వై.వి.వెంకటేశ్వరరావు |
| కార్యదర్శులు | : | ఆచార్య తంగిరాల సుబ్బారావు<br>డా. ఆర్వీయస్. సుందరం |
| సహకార్యదర్శులు | : | డా. దివాకర్ల రాజేశ్వరి<br>డా. పి.యు.బి. శర్మ<br>డా. కె . చంద్రప్ప<br>డా. ఎం. రుక్మాంగద నాయుడు<br>శ్రీ వి. రామనరసింహా రెడ్డి |
| కోశాధికారి | : | ఆచార్య సరగు కృష్ణమూర్తి |

---

**1994 లో చేరిన**

| | | |
|---|---|---|
| పోషకులు | : | శ్రీ వి. నారాయణప్ప,<br>పంతన హళ్ళి , కోలారు జిల్లా, కర్ణాటక. |
| జీవిత సభ్యులు | : | శ్రీ పి.మోహన్, సైనిక్ స్కూల్,<br>కోరుకొండ - 531 214. విజయనగరం జిల్లా.<br><br>శ్రీ పి. హజరత్ రెడ్డి, ఉపాధ్యాయుడు,<br>కక్కదాసం, ధర్మపురి జిల్లా, తమిళనాడు.<br><br>శ్రీమతి ఆర్.శారద, శ్రీఎల్. రామకుమార్ దంపతులు,<br>బాగేపల్లి, కోలారు జిల్లా, కర్ణాటక. |
| ప్రత్యేక సభ్యులు | : | శ్రీ డి.ఎం. వెంకటగిరి ఆచారి, బెంగుళూరు. |

---

# చైతన్యకవిత

భావ వసంతం 17 SPRING 1994



చైతన్య కవితా వేదిక బెంగుళూరు